

చిత్రం.... చిత్త ప్రసాద్

# మిసిమి

***"All that we are is the product of what we have thought," is "We are what we think."*** – **Dammapada.**

సంపుటి 2 | మార్చి 1992 | సంచిక 32


## విషయసూచిక


అందం, రమణీయతలు – అగేహానంద భారతి

త్రిపురనేనితో మధురవాణి – పురాణం సుబ్రహ్మణ్యశర్మ

మనసు పనితీరు – అట్లూరి వెంకటేశ్వరరావు

భర్త రమ్మంటే భార్య కాదనవచ్చా? "శ్రీనందు"

ఆధునిక విద్యావిధానం – సుజాత

చిత్తప్రసాద్ –చలసాని ప్రసాదరావు

అధిక్షేప కావ్యాలు – బూదరాజు రాధాకృష్ణమూర్తి


ముఖచిత్రం
బౌద్ధ ప్రాంగణ ద్వారం


విడిప్రతి 3/-

వార్షిక చందా రూ.40/-

Printed, Published and Edited by Shri ALAPATI RAVINDRANATH for and at Kala Jyothi Process Pvt. Ltd., 1-1-60/5, Iftekar Mansion Lane, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 612436, 612337.

**Editorial NEST**
B-15, Journalist Colony, Jubilee Hills, Hyderabad-500 034. Ph. 247717

# LIVING DICTIONARY

## (DEVIL'S DICTIONARY)

*Compiled by*
AMBROSE BIERCE (1911)

**Art,** *n.* This word has no definition. Its origin is related as follows by the ingenious.

**Artlessness,** *n.* A certain engaging quality to which women attain by long study and severe practice upon the admiring male, who is pleased to fancy it resembles the candid simplicity of his young.

**Asperse,** *v.t.* Maliciously to ascribe to another vicious actions which one has not had the temptation and opportunity to commit.

**Auctioneer,** *n.* The man who proclaims with a hammer that he has picked a pocket with his tongue.

**Australia,** *n.* A country lying in the South Sea, whose industrial and commercial development has been unspeakably retarded by an unfortunate dispute among geographers as to whether it is a continent or an island.

**Bacchus,** *n.* A convenient deity invented by the ancients as an excuse for getting drunk.

**Back,** *n.* That part of your friend which it is your privilege to contemplate in your adversity.

**Backbite,** *v.t.* To speak of a man as you find him when he can't find you.

**Bait,** *n.* A preparation that renders the hook more palatable. The best kind is beauty.

**Baptism,** *n.* A sacred rite of such efficacy that he who finds himself in heaven without having undergone it will be unhappy forever. It is performed with water in two ways-by immersion, or plunging, and by aspersion, or sprinking.

**Barometer,** *n.* An ingenious instrument which indicates what kind of weather we are having.

**Barrack,** *n.* A house in which soldiers enjoy a portion of that of which it is their business to deprive others.

**Bath,** *n.* A kind of mystic ceremony substituted for religious worship, with what spiritual efficacy has not been determined.

**Battle,** *n.* A method of untying with the teeth a political knot that would not yield to the tongue.

**Beard,** *n.* The hair that is commonly cut off by those who justly execrate the absurd Chinese custom of shaving the head.

**Beauty,** *n.* The power by which a woman charms a lover and terrifies a husband.

**Befriend,** *v.t.* To make an ingrate.

**Beg,** v. To ask for something with an earnestness proportioned to the belief that it will not be given.

**Beggar,** *n.* One who has relied on the assistance of his friends.

**Benedictines,** *n.* An order of monks otherwise known as black friars.

# శ్రుతి ప్రమాణాన్ని తిరస్కరించిన
# పునర్వికాస వాదుల వాతనపడ్డ
# అందం, రమణీయతలు

స్వేచ్ఛానువాదం:
కుమారి వరూధిని Ph.D,

ఆంగ్లమూలం:
అగేహానంద భారతి

కాశీపట్నం చూడడానికి వెళ్ళే యాత్రికుల్ని మణికర్ణిక ఘాట్ సమీపంలో మెట్ల దగ్గర బోటు కట్టేసి నేపాలి గుడి దగ్గరకు తీసుకెడతారు. ఆ దేవాలయంలో చెక్కబొమ్మలు శృంగారభరితాలు. చెక్కడంలో అందం అంతగా అనిపించదు. నేపాల్‌లో ఇలాంటి గుళ్ళు కొల్లలు. కాశీలో యిలాంటి గుడి ఉన్నట్లే తమకు తెలియదన్నట్లుగా వారణాసి పౌరులు నటిస్తారు. నాగరికులు, గణిక పాలకులు చెక్కించిన వివిధ భంగిమల శైవ శృంగారం, తాంత్రిక సంప్రదాయంలో స్త్రీ పురుషులు విగ్రహాలు నేపాల్‌కు సుప్రసిద్ధమే. ఖజరాహో, ఒరిస్సా దేవాలయాలు, తమిళనాడులో పల్లవులు కట్టించిన పాండ్యులు నిర్మించిన గొప్ప గుడులు, మైసూరు హోయిసల విగ్రహాలతో పోల్చితే, శిల్పంలో యివేమంత గొప్పవి కావు. కాని శృంగార శిల్పం దేవాలయాలపై వున్నట్లు ఇప్పుడిప్పుడే ఎంతో సమాచారం బయటపడడం, దీనిపై కావలసినంత సాహిత్యం వెలువడడం విశేషం.

సంస్కృత సాహిత్యాన్ని నిష్పాక్షికంగా చదివిన పండితులకు శృంగార కళ, రహస్యం కాదు. దేవాలయాలపై చెక్కవలసిన తీరు, వాస్తుశాస్త్రం శిల్పశాస్త్రం ప్రకారమే వున్నాయి. వీటి శృంగార భంగిమలు ఆ శాస్త్రాలలో వివరంగా సూచించారు. ముఖ్యంగా కావ్యశాస్త్రం, అలంకార శాస్త్రాలలో స్త్రీ పురుషుల శృంగారం గురించి విడమరచి చెప్పారు. ఇదంతా ఎంతో క్రమబద్ధంగా వున్నదని విస్మరించరాదు. కామశాస్త్రంలో శృంగారం నాజూకుగా చెప్పలేదు గాని, సామాజిక విశేషాలు శారీరక భంగిమలు మాత్రం సమృద్ధిగా వున్నాయి. అదంతా చదివితే శృంగారం పాళ్ళు తగ్గిపోయి, అసలు కామంపై కోర్కె తగ్గించాలనే ఉద్దేశంతో యిలా రాశారా అనిపిస్తుంది. కామశాస్త్రం రాసినప్పుడు వాత్స్యాయనుడు అస్ఖలిత బ్రహ్మచారినని రాసుకున్నాడు. రాగ ద్వేషాతీత మనస్సుతో రాశాడట. కాని కామాన్ని వర్గీకరిస్తే వున్న ఆసక్తి చచ్చిపోతుంది. కావ్యం, అలంకార శాస్త్రంలో అందానికి నిర్వచనాలు చెప్పడం, మనస్సుకు ఆహ్లాదాన్ని చేకూర్చడం గమనిస్తాం. కామశాస్త్రంలో యిది లోపించింది.

భారతీయ దర్శనాలలో తత్వంలోనూ రమణీయత, అలంకారం లేదు. కావ్యాలలోనే యిది సమృద్ధిగా వుంది. కావ్యాలలోనూ వర్గీకరణ లేకపోలేదు. భారతీయ శాస్త్రాలలో యిది సర్వ సాధారణ లక్షణమే కాని రమణీయత పద్ధతులు కావ్యాలలో చాలా పేర్కొన్నారు. విదేశాలలో ఎల్టన్, లాంగర్, కాలింగ్ ఫుడ్‌లు రాసినట్లు భారతదేశంలో రమణీయత గురించి రాయాలంటే భాషాతత్వ విశ్లేషణకు తగినంత పరికరాలున్నాయన్న మాట. అయినా భారతీయులు విశ్లేషణ తత్వం అధ్యయనం చేయనందున యీ విశేషాలు బయటకు రాలేదు. ఇది బ్రిటన్, అమెరికాలలో విపరీతంగా చేశారు. ఇండియాలో ఇంకా హెగెల్, కాంట్,

**బ్రాడ్లీ, బొసాంకీ** దగ్గరే ఆగిపోయి, కొట్టు మిట్టాడుతున్నారు. జడ ప్రాయంగా వున్నారు. హిందూ పునర్వికాసకారులు యీ విషయంలో కోట కట్టినట్లు పురోగమనాన్ని అడ్డుకున్నారు. అందం, మంచితనం అనే వాటిని కప్పిపుచ్చే పవిత్ర భాష తొడుగుల్లో అనాసక్తికర విషయాన్ని చెప్పారు. సత్యం, శివం, సుందరం అనే వాటికి అర్రులు చాచారు. అస్పష్టతను పాశ్చాత్య తాత్వికులు సహించడం లేదు. పాశ్చాత్య తత్వాన్ని అధ్యయనం చేస్తున్న భారతీయ విద్యార్థులు వేదాంత అధ్యయనం దగ్గరే ఆగిపోయి, అంతకుమించి శ్రమించదలచ లేదు.

## సంస్కృతంలో రమణీయకావ్యాలు

రమణీయతను, క్రమబద్ధంగా ఆధునిక విశ్లేషణను, అధ్యయనం చేయకపోడానికి ఎన్నో కారణాలున్నాయి. సంస్కృతం చదవక పోవడం అందులో ఒకటి. రామమోహన్ రాయ్, రామకృష్ణ పరమహంస, వారి శిష్యులు సంస్కృతాన్ని చిన్న చూపు చూచారు. పండితులైతే ఏమి సాధిస్తారు అని రామకృష్ణ ఉవాచ. నిశితంగా చదివి, రమణీయతను చూచే ధోరణిని హిందూ పండితులు నిరసించడం విచారకరం. ముక్తి పేరిట ఎంత చేసినా ఏమి రాసినా సంస్కృతంలోని రమణీయతల్ని విస్మరించడం విచారకరం. సంస్కృతాన్ని చిన్న చూపు చూడడంతోబాటు, ఇంగ్లీషులో సరైన పాండిత్యం లేకపోవడం కూడా మరొక కారణం.

**ఆర్యసమాజం వారు హిందూ పునర్వికాసం పేరిట సొంత అధ్యయనం చేస్తూ, ఉపనిషత్తులకు శ్రుతి ప్రమాణాన్ని నిరాకరించారు.**

ఉపనిషత్తులు వేదాలలో భాగమని హిందూ దర్శనాలు చదివిన వారంతా ఒప్పుకుంటారు. ఆర్య సమాజం ఒప్పుకోపోడానికి, ఉపనిషత్తులలో ముఖ్యంగా **బృహదారణ్యకోపనిషత్తులో** శృంగార భంగిమలు, లీలలు గురించి పచ్చి వర్ణన లుండడమే కారణమన్నారు. సంహితలోనూ యిలాంటివి చాలా వున్నప్పటికీ ఆర్య సమాజిస్టులు వీటి అర్థాలు మార్చేసి భాష్యం చెప్పుకొని తృప్తి పడుతున్నారు. పీఠం, లింగం అనే వాటికి అర్థాలు వేరుగా చెప్పారు. ఇలాంటి అలవాటు ఉత్తరోత్తరా ఒక లక్షణమై పోయింది.

# బౌద్ధంలో రమణీయత

బౌద్ధంలో విశ్వజనీన కళాత్మక కార్యకలాపాలున్నాయి; రమణీయత వున్నది. పాండిత్య చర్య వున్నది. భిన్న సంస్కృతులున్నాయి. అదంతా వదలేసి, ప్రపంచ శాంతిని కాంక్షిస్తుంది గనుక బౌద్ధం మంచిది, అనుసరణీయం అని బుద్ధ జయంతి నాడు ప్రధాని (నెహ్రూ) బోధించాడనుకోండి. అలాగయితే ఒలింపిక్ క్రీడలు, అంతర్జాతీయ బ్రిడ్జ్ ఆట, సంగీతోత్సవాలు ప్రపంచ శాంతికి తోడ్పడతాయి గనుక, అవి పాటించండి అన్నట్లే వుంటుంది. బౌద్ధం యుద్ధాన్ని ఆపవచ్చు. బౌద్ధ విగ్రహాలలో బంగారం వుంటుందని సయాం రాజధాని అయుథిలోని బౌద్ధ విగ్రహాల కోసం బర్మా వారు దాడి చేశారు. భరత నాట్యం శాంతికి ఉపకరించవచ్చునేమో. కాని వాటి ప్రయోజనం రమణీయతలో చూడాలి గాని, శాంతి కోసం కాదు. భారతీయ సంస్కృతిలో అంతర్భాగంగా భరత నాట్యాన్ని స్వీకరించాలి. వాటి సందర్భాన్ని విస్మరించి చెబితే, అర్థం పోతుంది. బోయింగ్ విమానంలో అందమైన అమ్మాయి స్టీవర్డ్‌గా వుండటం ప్రయాణానికి బాగుండ వచ్చు అనేది, మంచి మాటే కావచ్చు. కాని అదేమంత ప్రధాన విషయం కాదు గదా. అలాగే హైందవం, బౌద్ధం శాంతి కోసం ఉపకరిస్తాయనడం కూడా అర్థం లేని మాటలే.

## పవిత్రత పేరిట రసాభాసం

పవిత్రత పేరిట అసలు విషయాలు విస్మరించే ప్రమాదం వుంది. లోగడ విశ్వామిత్రుని వంటి వారు, నేడు కొందరు పవిత్ర ఋషులు యీ పవిత్ర ధోరణి అనుసరించడంతో, భారతీయ కళల్లో. సాహిత్యంలో రమణీయత, శృంగార నాజూకు విషయాలు పక్కకు నెట్టేశారు. మహాత్మాగాంధీని ఒకసారి ఎం.ఎన్. రాయ్ అడిగారట "కోనార్క్ దేవాలయం"పై వున్న శిల్పం గురించి మీరేమంటారని, '**నా చేతిలో అధికారం వుంటే అలాంటి దేవాలయాల్ని కూలగొడతా నన్నారట!**' ఇలాంటి విషయంలో నాయకుల అభిప్రాయాల్ని విమర్శకులు, పండితులు, నిపుణులు ప్రశ్నించరు. అదే ప్రమాదం, మానవ శాస్త్రాలు బాషా అధ్యయనం చేస్తే గాని యిలాంటి ధోరణులకు విరుగుడు రాదు. ఇండియాలో లలిత కళల్ని ప్రభుత్వం పోషించడమే పెద్ద ప్రమాదం. పవిత్రత పేరిట ప్రభుత్వం, గాంధీ వంటి నాయకుల భావాల్ని ఆచరణలో పెడుతూ అసలు విషయాల్ని పక్కకు నెట్టడం సహజం.

దక్షిణాదిలో పర్యటించే యాత్రికుడు అందం కోసం వీక్షించాలంటే నాట్యమందిరం దగ్గర ఆగుతాడు. భరత నాట్యం కోసం వేచి వుంటాడు. ముద్ర, అభినయాలు రమణీయతల్ని సూచిస్తాయి. ఉపనిషత్తులలో రమణీయత వున్నది.

'శ్రుతి'లో రసప్రస్తావన లేదంటాడు ప్రొఫెసర్ వి. రాఘవన్; భరత నాట్యంపై బాగా నిష్ణాతుడే ఆయన. శాస్త్రోక్తంగా ఆయన కుమార్తెకు భరత నాట్యంలో శిక్షణ యిచ్చాడు. పరంపర ప్రాప్తిలో శారీరక శృంగార భంగిమలు అంతర్భాగాలే. కాని పవిత్రత పేరిట వాటిని అంగీకరించలేక పోతున్నారు. చైతన్యుడి కీర్తనలు, జయదేవుడి గీతాగోవిందం, కుమార సంభవంలో శృంగారాన్ని ఆధ్యాత్మికంగా భాష్యం చెప్పవచ్చు. దైవత్వాన్ని ఆపాదించే ప్రయత్నం చేయవచ్చు. కాని యీ కళాఖండాలన్నీ భక్తిగా ముద్రవేసి శృంగారాన్ని వినియోగించినవే. లింగం అనే శబ్దాన్ని ఎన్ని రకాలుగా తిప్పి చెప్పి, అదొక యజ్ఞ చిహ్నంగా చూపాలన్నా, మూలార్థం మారదు. కాని ఎవరైనా ఏమైనా అనుకుంటారేమోననే ధోరణితో కప్పిపుచ్చుకోవడం కనిపిస్తున్నది. చైతన్య భక్తి గీతాలు, జయదేవుడి గీతా గోవిందం, చండేలా రాజుల శృంగార శిల్ప సంపద వక్రీకరిస్తే మంచిది కాదేమో.

ఆనాడు అలాంటి కార్యకలాపాలు సాగకపోతే, ఆ కళలో, రమణీయత, శృంగారం రావు. కళను నిరసించడం అంటే కళాకారుల్ని దిగజార్చడమే. హిందూ పునర్వికాస కారులు నీచ శృంగారాన్ని ఈసడించే పేరిట కళల్ని, శృంగారాన్ని, రమణీయతను తుడిచి పెడుతున్నారు. సంప్రదాయంగా వచ్చిన ఔన్నత్యాన్ని కాదనలేక, కళాఖండాలలో చిన్న దోషాల్ని పట్టుకొని లాగుతున్నారు. అసలు విషయం అందులో శృంగారం ఉన్నదనే గాని, అవి కళాదోషాలతో వున్నాయని కాదు. సంస్కృత పవిత్ర భాషలో యిలాంటి వాటికి చోటు లేదని పండితులు పడే భ్రమ; ఇది చాలా దోషపూరిత భావనే. కాంట్ జర్మన్ రచన చాలా ఘోరంగా వుంటుంది. మహాయన బౌద్ధుల సంస్కృత రచనలు దుర్భరంగా వుంటాయి. కాని వారి భావాల్ని భాషాపరంగా చూచి ఖండించలేం గదా. కాంట్ తత్వాన్ని, వసుబంధు చింతనను అలా నిర్ణయించ రాదుగదా. సంస్కృత సంప్రదాయం మాత్రం తప్పుడు త్రోవనే పయనిస్తున్నది. ముఖ్యంగా రమణీయతను నిర్ధారించడంలో యీ ధోరణి అనుసరించింది.

కంజీవరంలో పల్లవ గుడి చూపినప్పుడు, మండపం చుట్టూ శృంగార శిల్ప సౌందర్యం చూచి రాసుకున్నాను. మిగిలిన చోట్లతో పోల్చితే యీ మండప శృంగార శిల్పం అపురూప కళాఖండాలతో వున్నది. ఇది మైథున శిల్ప కళాఖండాల మయం. రాళ్ళపై పచ్చి చౌకబారు శృంగారాన్నే నీవు గమనిస్తావా అని అక్కడి పురోహితుడు ఆగ్రహించాడు. మాకీ అశుద్ధ శిల్ప దృష్టి లేదన్నాడు. అంటే నాది మలిన దృష్టి అని అతడి సారాంశం. ఇలాంటి సన్నివేశాలు లోగడ అతడికి తారసిల్లి వుండాలి. అందుకే కాబోలు జాగ్రత్తగా, సంస్కృతంలో నాతో మాట్లాడాడు. కళాత్మకంగా వున్నాయి గదా, రమణీయకంగా మండలప స్థంబాలు చెక్కారు గదా అని చూపగా, అవి రమణీయకాలు ఎలా అవుతాయంటూ డాయన!

దేవాలయాల శిల్పం తెలిసిన వారికి మైథున కళాఖండాలు కొత్తగాదు. ముల్కరాజ్ ఆనంద్, జిమ్మర్ రచనలే అందుకు చదవనక్కర లేదు. ముస్లింలు దండయాత్రలు చేసినప్పుడు, హిందువులు ఎక్కువ ప్రేరణతో పిల్లల్ని కనడానికి దేవాలయంపై శృంగార శిల్పం చెక్కారని ఒక వివరణ వున్నది. ఇది హాస్యాస్పదం. ఆర్య జీవనంలో గృహస్థ ధర్మం ఒకటి. కనుక, ధర్మార్థ కామమోక్షాలలో భాగంగా మైథునం కళగా చెక్కి వుంటారని పండితులన్నారు. భారతీయ కళల్లో మైథునం వ్యాపించడానికి యిదే మూలకారణం కాదు. అయితే యిది ఒక కారణం మాత్రం కావచ్చు.

గర్భగుడి దగ్గరకు వెళ్ళే వారు మనస్సు పవిత్రం చేసుకొని రావాలని ఉద్దేశించారట. గుడి చుట్టూ ప్రదక్షిణలు చేసే భక్తులు, గుడిపై చెక్కిన అనేక కళాఖండాలు చూస్తారు. అందులో మైథునం కూడా ఒకటి. ఆ దశలన్నీ అధిగమించి గుడిలో ప్రవేశించే ముందు భక్తులు ప్రశాంత మనస్సుతో దైవ దర్శనం చేసుకుంటారు. ఇవి దక్షిణాదిలో చాలా ఎక్కువ. వాస్తుశాస్త్రం ప్రకారం మండపాల్ని చుట్టి దేవాలయంలో ప్రవేశించిన వారు, మార్మిక చిహ్నమైన మండలాన్ని దర్శిస్తారు. అంటే మూల విగ్రహమే మండలం. పవిత్రత కోసం అల్లిన యీ కల్పిత గాథలన్నీ ఎలా వున్నా, భక్తులు మాత్రం కళారాధకులుగా దేవాలయ శిల్ప సంపదను చూడరు. త్వరగా ప్రదక్షిణలు ముగించి దైవ దర్శనం చేసి పోతుంటారు. ప్రసాదం స్వీకరించి బయట పడతారు. మైథున శిల్పం దగ్గర ఆగి భక్తులు పరిశీలించరు. సనాతన పండితులే తమ ఆగ్రహం వెల్లడించడానికి యీ పరిశీలన చేస్తారు. ఖజురాహోకు విమానాలు నడుపుతున్నా, యాత్రా స్థలంగా ప్రాముఖ్యం యిచ్చినా, మైథున కళల్ని అంతగా ప్రస్తావించక పోవడం ఇండియాలో అధికార ధోరణిని సూచిస్తుంది. ఇలాంటి ధోరణి సామాజిక శాస్త్ర బోధకులలోనూ ప్రబలివుంది. మైథున కళపై అట్టే దృష్టి కేంద్రీకరించరాదనేది వీరి ఉద్దేశం.

## శిల్ప, వాస్తుశాస్త్రరీత్యా శృంగారం

హిందూ ఇండియాలో సెక్యులర్ కళలు కనిపించవు. కామం, రతి సర్వసామాన్యంగా వున్నాయి. వీటి వెనుక గూఢార్థం ఏదో వుందనే వాదన సంగతి అలా వుంచండి. కాని కళాకారులు తమ రమణీయతను వెల్లడించడానికి మతాన్ని అడ్డం పెట్టుకున్నారు. దేవతను గాని, సామాన్య స్త్రీని గాని వివిధ భంగిమలలో చూపే కళాకారుడు, కళాతీతుడన్నట్లుగా చూపి ప్రయోజనం లేదు. తాము సృష్టించిన కళా ఖండాలు శృంగార భరితంగా వున్నాయనే

ఉద్దేశంతో యూరోప్‌లో బోట్‌సెల్లి (Botcelli, Tintoretto) టిన్‌టోరేట్టోలు వాటిని ధ్వంసం చేశారు. క్రైస్తవ మత ప్రభావం వలన ఇండియాలో అంత ఘోరం లేదు. హిందూ పునర్వికాస కారుల్ని మినహాయిస్తే, శిల్పశాస్త్రం, వాస్తు శాస్త్రాలలో శృంగారాన్ని తృణీకరించ లేదు. పైగా రసపోషణను ప్రోత్సహించారు. శాంత రసానికి 9వ స్థానం కల్పించారు. ఇది అత్యున్నతమైన దన్నారు. మిగిలిన 8 రసాలు శాంత రసానికంటే తక్కువ స్థాయివి అన్నారు. అలంకార శాస్త్రంలో సెక్యులర్ ధోరణులు ప్రవేశపెట్టిన వారిని కాదనలేక వూరుకున్నారు. తాంత్రిక కళాకారుల్ని ఆగ్రహంతోనే చూచారు. తాంత్రిక కళ వేదోపనిషత్తుల సంప్రదాయం అని బెంగాలి పండితులు అధికారికంగా చూపారు. మైథున కళతోబాటు భక్తి తదితర యోగాల్ని పోషించిన తాంత్రిక విద్య వామాచార శాస్త్రం. టిబెట్‌లో అధికారికంగా యీ విద్యను మోక్షగామిగా గుర్తించారు. అందుకే టిబెట్‌కు కష్టాలొచ్చాయంటారు హిందూ పండితులు. తాంత్రిక ప్రభావం వల్లనే హిందూ సంస్కృతి, కళ, నాగరికత దిగజారినవని పవిత్ర హిందూ సనాతనుల ఉద్దేశం.

పల్లవుల పాలనలో సంన్యసనాన్ని అధికారికంగా ప్రోత్సహించారు. చందేలా రాజ్యంలో తాంత్రికుడు కాకుండా ఎవరూ వుండటానికి వీల్లేదన్నా చెల్లేదేమో. నేడు తాంత్రికుడికి ఇండియాలో చోటే లేదు. నేడు ఇండియాలో తాంత్రికులెవరైనా వున్నా వారిని అనుమానంతో చూస్తారు.

అంటే అధికార ధోరణుల బట్టి విలువలు మారతాయనడానికి యిదొక ఉదాహరణ. అధికారికంగా ఏ దృష్టి వుంటే అటు మొగ్గు చూపడం పరిపాటే. ఇతర రంగాలలో ఎలా వున్నా, సంగీతం పట్ల అధికారికంగా ధోరణి అట్టే మారలేదు. అలాగే నాట్యం పట్ల కూడా. ఉన్నత కుటుంబాలలో సైతం నేడు నాట్యానికి ప్రతిష్ఠ చేకూరింది. హిందూ పునర్వికాసంలో యిదొక మంచి ధోరణే. నాట్యం పట్ల సహనం పెరిగి, ఆమోదించడం దేశంలో సర్వత్రా కనిపిస్తున్నది. రవివర్మ చిత్రాలు శృంగార భరితాలు, ఆయన వాడిన రంగులు దుర్భరాలు. అయినా 20వ శతాబ్దపు ఇండియా వాటిని సహించి ఆమోదించింది. రవివర్మ బొమ్మల్ని పొగిడే వారంతా అందలి విషయాన్నే ఆరాధిస్తున్నారు. రామాయణం, పురాణాలు, బృందావన కృష్ణుడు, మీసాలతో శివుడు, గణేశుడు, స్కంద, దేవి, చిన్న నందిపై వీరిని చూపడం, ఇదంతా నచ్చిన వారే యిలా శ్లాఘిస్తున్నారు. శాంతి నికేతన్, కలకత్తా ముఠా, జమినీరాయ్, బొంబాయి ముఠా వారి కళాఖండాలు హిందువులకు ప్రేరేపణ కలిగించడం లేదు. వీరికి ప్రజా ప్రాచుర్యం లభించక పోడానికి కారణం? వీరూ రామాయణ యితివృత్తాన్ని, కృష్ణుడ్ని, పురాణాల్ని కళల్లో చూపితే తప్ప వీరిని ఆమోదించరు. దేవి చిత్రం నిరూప్ రాయ్‌ను పోలివుంటే తప్ప (హరహర మహాదేవ్ చిత్రంలో) మార్కెట్‌లో లభించే వాయిల్ చీర కట్టిస్తే తప్ప, దేవిని గుర్తించే దెలా? దేవాలయ కళాఖండాలలో నగ్న దృశ్యాలు ఆమెను పోలి వున్నా, అధికారికంగా ఆమోదించడం లేదు.

## నలుపులో అందం లేదా?

ఇండియాలో రంగు దృష్టిపై వ్యాఖ్యానించక తప్పదు. తెల్లని (ఎర్రని) వర్ణం అంటే మోజు ఎక్కువ. ఇంగ్లీషు వారి తెలుపు రంగు అంటే పాలిపోయినట్లు వున్నారనే ఉద్దేశంతో, అందంగా

వుండటం అంటే తెల్లగా వుండటం కాదన్నారు. కాని తెలుపు, అందం అనేవి నేటికీ ఒకటే అని ఇండియాలో అభిప్రాయం వుంది. కాశ్మీర్, పంజాబ్, కన్నడ సారస్వత బ్రాహ్మణులు తెల్లగా వుంటారు. వారు అందంగా వుంటారు. అంతే కాదు. కేరళ సుందరి నలుపుగా వుంటుంది. బెంగాల్లో నల్లని స్త్రీలు చాలా మంది ఎంతో అందంగా వుంటారు. నల్లని వర్ణం గురించిన విషయం రాను రాను నీతిపరంగా నిర్ణయించాల్సి వచ్చేట్లుంది.

నల్లని సౌందర్యాన్ని నేను శ్లాఘిస్తే ఇబ్బంది పడే వారిని చూచాను. సనాతన భారత సంప్రదాయంలో స్త్రీలను పొగడటం సహించరు. అందమైన స్త్రీని పొగిడితే ఆమెతో సంపర్కం కావాలనుకునే దృష్టి వున్నదనుకుంటారు. పేరెత్తకుండా, ఫలానా స్త్రీ అందంగా వుంది అనకుండా, సహజంగా నలుపు సౌందర్యాన్ని పొగిడినా అంత మెప్పు రావడం లేదు. **ద్రౌపది అంటే కృష్ణ అనీ, అనగా నల్లనిదని పండితులకు తెలుసు. పురాణాలలో, ఇతిహాసాలలో** చాలా మంది సౌందర్యవతులు శ్యామ వర్ణం వారే. నల్లని అమ్మాయిలు ఆనందాన్నిస్తారని ఉర్దూలో నానుడి వుంది. ఇంత జరిగినా నలుపు వర్ణం వికారానికి, తెలుపు రంగు అందానికి పెట్టిన పేర్లుగానే నిలచినవి. అందుకే తెల్లగా వుండే కాశ్మీర్ స్త్రీలు అందగత్తెలనుకుంటారు. లక్నో ముస్లిం స్త్రీలు చాలా అందగత్తెలని నా పండిత స్నేహితుని ఉద్దేశం. నరాలు చర్మంలో తొంగి చూస్తుంటాయంటాడు. రక్తహీనత వలన పాలిపోయి తెల్లగా వుండటం ఒక జబ్బు అని గుర్తించక, అది అందంగా వుందనుకోవడం భారతీయ ఆలోచనా సరళి.

ఆర్యులు వేదాలతోబాటు, ఋషులతోబాటు శృంగార రహితమైన తెల్లని వర్ణం వారట. నల్లని స్త్రీని మోహిస్తే జుగుప్సతో, చూచే వారట. నల్లని స్త్రీలు అందవిహీనలు. వారి మనస్సులు రాగ ద్వేషభరితాలు, శృంగార ప్రియాలు. భగవద్గీత ప్రకారం సాత్విక, రజో, తమో గుణాల్ని వర్గీకరించారు. అందులో నల్లని రంగు రజోగుణం అన్నారు. ఇదే పునర్వికాస సంస్కృతిలో వ్యాపించింది. ఇండియాలో వున్నంత రంగుపై మోజు ఆసియాలో ఎక్కడా లేదేమో. నల్లని అమ్మాయిలు ఖర్చు గావడం (పెళ్ళికి) కష్టంగా వుంది. నలుపు అందం అని మేం వూహించ లేమంటారు భారతీయులు. ఇది అధికార ధోరణి కనుక వారు ఖజురాహో, కోనార్కలను సైతం నాశనం చేయడానికి వీరు వెనకాడరు.

దేవాలయాలు నిర్మించిన కళాకారులకూ, తాటాకు గ్రంథాలు రాసిన వారికీ చాలా కళా సౌందర్యోపాసన వుంది. బావిలో నీళ్ళు తోడే స్త్రీ ఒంపు సొంపుల్ని చిత్రించే చిత్రకారులు అధిక సంఖ్యాకుల అభిప్రాయాలకు దూరం. కేరళలో మడుగులలో స్నానం చేసే స్త్రీలలో చాలా సౌందర్యం వుంది. వారిని చిత్రించే వారి కళలు అధికారిక అభిప్రాయానికి సరిపోవు.

కేరళలో క్రైస్తవ స్త్రీలు ఎక్కువ సార్లు స్నానం చేయరు. హిందూ సుందరులు చాలాసార్లు రోజూ స్నానం చేస్తారు. ఆత్మ వేరు, శరీరం వేరు అని క్రైస్తవ బోధకులు కొత్తగా మతం మారిన స్త్రీలకు ఎలా చెప్పారో తెలియదు గాని వారు మాత్రం పాటిస్తున్నారు. యూరోప్‌లో కూడా క్రైస్తవులు అందం, మంచితనం, ఒకటి కావనే బోధించారు. సత్యం శివం సుందరం అనే భావన విడదీసినట్లేనన్న మాట. క్రైస్తవులు బానిసల ఉద్ధరణకై కృషి చేస్తారనీ, బానిసలకు (వారి స్త్రీలకు) అందం ప్రశ్నే లేదనీ అన్నారు. బానిసయజమాని భార్య మాత్రమే అందమైన దుస్తులలో శిల్ప సౌందర్యం నిమిత్తం కళాకారుని ఎదుట కూర్చుంటుంది.

ఆర్యులు తొలుత అందాన్ని మంచితనాన్ని ఏకంగా చూచారు. ఇండియాకు తెచ్చారు. వారికి ముందే వున్న భారతీయులలో యీ భావన బలంగా వుండేది. రమణీయతా సంస్కృతిని భారతీయులు బాగా విస్తరించారు.

అమెరికాలో లైంగిక ముఖ భంగిమలు అలవాటే. ఒకప్పుడు ఇండియాలో యివి వుండేవని సాహిత్యం చాటుతున్నది. సెక్స్‌లో వివిధ భంగిమలు కూడా వుండేవి. మైసూరు, మధ్య భారత్‌లో కనీసం నాలుగు దేవాలయాలు ఇందుకు నిదర్శన.

శృంగారంలో వివిధ భంగిమలు లేకుండా కేవలం జంతువుల వలె భంగిమలో రతి జరపాలని సనాతనుల దృష్టి. శిక్కులు, ముస్లింలు కూడా నాతో యిలాగే అన్నారు. ఖజురాహో, కోనార్క్ శిల్ప సంపద, కామ సాహిత్యం, మానసిక స్వేచ్ఛ కావాలనే వారంతా అభ్యుదయాన్ని ఆకాంక్షించిన కళాకారులే. మోక్ష ధర్మాన్ని అనుసరిస్తున్నామని వీరంతా నాటి పాలకుల్ని ఒప్పించారన్న మాట. అంటే వాత్స్యాయనుడు, **ఘోటక ముఖుడు, దక్షిణాచారి, జఘనా** చారి యిది సాధించారన్న మాటే. చండేలా, హోయిసలా రాజులు శృంగార శిల్పాన్ని పోషించారంటే, ఆలంకారికులు, కావ్యాలు, కామ సూత్రాలన్నీ నాగరిక లక్షణాలనడమే కారణం. దీనికి తాంత్రిక సాధన కూడా తోడైంది. పల్లెలో తపస్సు చేసుకునే సాధనకూ నగరాలలో సాధనకూ యిలాంటి తేడాలు చూపారన్న మాట. నేడు తాంత్రికుడెవరైనా వుంటే, కాలం వృధా చేస్తున్నాడంటారు.

భారత తాత్విక రచనలలో ప్రాశ్చాత్య నిశిత పరిశీలన ప్రభావం పడకుండా, కొత్తగా వచ్చిన భావనలు ఏవీ కనిపించవు. బెంగాలీ జాతీయ దృష్టి ప్రబలడంతో కొంత మేరకు సెక్యులర్ ధోరణులు కనిపించాయి. అయితే హిందూ వికాస పంథా అంతా మైథునం నుండి నీతిని వేరుచేసే ప్రయత్నంలో నిమగ్న మైంది. మధ్య శకాల్లోని మైథున కళను వీరు స్వీకరించ లేకపోయారు. మైథునం తప్ప మరే పాపాన్నైనా పునర్వికాసకారులు సహిస్తారు. శివుణ్ణి లింగాకారంలోనే పూజించాలి. కాని నేడది ఉల్లంఘించి విగ్రహారాధన ప్రవేశపెట్టారు. నడుం కనిపించకుండా కాలేజీకి దుస్తులు వేసుక రావాలని ఒక స్త్రీల కళాశాల ప్రిన్సిపాల్ ఉత్తర్వులు జారీ చేసింది. ఒకమ్మాయి కాశీ పండితుడిని యీ విషయమై సంప్రదించగా, **అవివాహితలైన ఉన్నత వంశ యువతులు స్తనాలకు నాభికి మధ్య శరీరాన్ని కప్పి వుచ్చరాదన్నట్లు శాస్త్రోక్తంగా ఉదహరించాడు!**

పునర్వికాస కర్తలు ప్రమాణ గ్రంథాల్ని తమకు అనుకూలంగా భాష్యం చెప్పారు. గాయత్రి మంత్రానికి ఆర్యసమాజవాదులు యిలా అర్థం మార్చేశారు: ప్రచోదయాత్ అనే పదం ప్రేరణకు పురికొల్పుననుకొని, ప్రాణోదయత్ అని రాస్తున్నారు. చోద్ అనేది శృంగార కామ భరితమన్నారు. శ్రుతిలో వున్న మాటను యిలా మార్చడానికి వారు సాహసించారు. **రాజా రామమోహన్‌రాయ్** కూడా ఏకేశ్వరారాధన భావనకు అనుకూలంగా తన ఉపనిషత్తు అనువాదాల్ని చేశాడు. అహం బ్రహ్మోస్మి అర్థం వచ్చే మాటల్ని కావాలని వదలేశాడు. తమకు అనుకూలంగాని వాటిని వదలేయడం, యిష్టం వచ్చిన భాష్యం చెప్పడం హిందూ సంప్రదాయంలో వుంది. ఈ పని ప్రాచీన ఆచార్యులు చేయలేదు. పరంపరగా ప్రాప్తించిన వాటిల్లో తాంత్రిక విద్య ఒకటి. దేవాలయాలపై శృంగార శిల్పం, దేవదాసి పద్ధతి కూడా హిందూ పరంపర సంప్రదాయమే. వేదాలు, పురాణాలు, ఆర్యులు రాక పూర్వం శివశక్తి వారి మైథునం,

విశ్వ సూత్రాలు మొదలైన అంశాల ద్వారా తాంత్రికులు అనేక మానసిక రీతుల్ని ప్రవేశ పెట్టారు.

శాశ్వత సంగమ భాగంగా ఆప్యాయతల్ని పరాకాష్ఠ పారవశ్యతల్ని కళా రూపాల్లో చూపారు. స్త్రీ పురుష చైతన్యమును శివశక్తిగా గ్రహించారు. తాంత్రికులు గౌడ, త్రిక, కౌల విభాగాలుగా పెంపొందించిన వాటినే, భాగవత తత్వంలో వైష్ణవులు విస్ఫారజేశారు. బెంగాల్ లో గౌడీయులు, దక్షిణాదిలో ఆళ్వారులు, పశ్చిమ తీరాన వల్లభులు యీ కోవకు చెందిన వారే.

చిత్రకళకు పూర్వమే, తంత్రానికి ముందే విశిష్టమైన కావ్య సాహిత్యం వచ్చింది. రస సిద్ధాంతం ప్రపంచ సాహిత్యంలోనే మకుటాయమానంగా విరాజిల్లింది. ఇది మనో, రమణీయతకు చెందింది. వాత్స్యాయన సూత్రాలు, వాటిపై భాష్యాలు, కొక్కోక శాస్త్రం, రతి రహస్యం హిందువుల చిత్తశుద్ధి సృష్టి మాత్రమే. ధర్మంలో వలె శృంగారంలోనూ నిష్ఠగా సాధించడం హిందువుల ఉద్దేశం. పురుషార్థాలలో శృంగారం (కామం) ఒకటి. కేవలం, అర్థం కంటె తక్కువది కాదు. అన్నీ సమాన స్థాయిలోనివే.

ఎం.ఎన్. రాయ్ చెప్పినట్లు ధర్మ మోక్షాల మధ్య కామం, అర్థంను అణిచి పెట్టి నొక్కేశారు. ధర్మార్థ కామమోక్షాలలో విలువల నిచ్చెన మెట్లన్నీ తర్వాత ఆపాదించినవే. అన్నీ సాధించిన వాడే అధికారి అయ్యి, మోక్షసాధనకు అర్హుడౌతాడు. శంకరుడు వీటిపై వ్యాఖ్యానిస్తూ పూర్వ జన్మలో వీటిని సాధించిన వాడు సరాసరి యోగిగా తృప్తిగా మోక్ష సాధనకు పూనుకోవచ్చన్నాడు.

## శృంగారమే ఆదిరసం

రమణీయక చర్చలో శృంగార చర్చ ఎందుకంటే, హిందువులకు శృంగార రసమే ఆది రసం. సంప్రదాయ భారత సంగీతమంతా శృంగార రసభరితమే (కనీసం 75 శాతం). ముద్ర, అభినయంలో ఇది స్పష్టం. వీటిని సరిగా అవగాహన చేసుకున్న వారు రమణీయతను బాగా ఆకళింపు చేసుకున్నట్లే. హిందూ కళాకారులకు యీ దృష్టి వుంది. అప్సరస, యక్షిపై శీతకన్ను వేస్తే సజీవ స్త్రీ సౌందర్యాన్ని అభినందించలేదు.

ఆర్యులు ఆనందమయులు కారు. ఆర్యులు పూర్వం వున్న భారతీయులును అనుకరించి ఆనందాన్ని అనుభవించిన వారు. నేటికీ పంజాబ్, ఢిల్లీ వారికి పాలిపోయిన రంగే అందం. దక్షిణాది వారి దృష్టి వేరు.

దక్షిణాది సాహిత్యంలో రమణీయత బాగా విలసిల్లింది. కేవలం ముస్లిం దాడుల వలననే ఉత్తరాదివారి దేవాలయాలపై రమణీయత కోల్పేలేదు. జైన దేవాలయాల్లో అలాగే వుంటాయి. దక్షిణాదిలో సున్నిత కళాఖండాల్ని, రూపాల్ని అసహ్యంగా భావించి ఖండించరు. ఉత్తరాదిలో అలా చేస్తారు.

## శృంగారాన్ని పోషించిన మార్మికులు

దైవత్వాన్ని అందాన్ని ముఖ్యంగా శృంగారాన్ని కలిపి చూస్తాడు మార్మికుడు. సంన్యసమును శృంగారాన్ని మిళితం చేసిన ఉదాహరణలు చైతన్యంలో చూడవచ్చు. సమాజం

సాధారణంగా మార్మికుడి రచన చూడదు. అతడి జీవితాన్ని గమనిస్తుంది. ఇది సంకుచిత దృష్టి. మతాన్ని అందాన్ని కలిపి చూశారు మార్మికులు. శృంగారాన్ని మహోన్నతంగా భావించారు. ఇందుకు భిన్నంగా రామాయణం వైపు పోతూ, కృష్ణుడి దృష్టిని కాదంటున్నారు చాలామంది. అయితే బృందావనం లేకుండా చైతన్య, మీరాలకు జీవనమే లేదు. కావ్య శాస్త్రాలలో రాముడు, సీతలకు అల్పస్థానం వుంది. వారు కేవలం జాయాపతులే. రమణీయత అధ్యయనంలో కృష్ణుడు పూర్తి అవతారం కాగా వారి దృష్ట్యా రాముడు అనల్పుడే. ఇంకా సంపూర్ణ అవతారం - రమణీయతలో - విష్ణువుదే. తమ అనుభవాల్ని శృంగార సాహిత్యం ద్వారా భారత మార్మికులు వెల్లడించగలిగారు. ఇందుకు విరుద్ధంగా వచ్చిన భావన పాక్షిక దృష్టి గలదే. భారతదేశంలో చదువుకున్న వారు యీ పాక్షిక సంకుచిత దృష్టి విడనాడితే, రమణీయత ప్రమాణాల్ని గురించి సరైన దృష్టి అలవరచుకోవచ్చు. రామమోహన్ రాయ్‌వంటి హిందూ సంస్కర్తలు తెచ్చిపెట్టిన యీ సంకుచిత దృష్టి వదలాలి. ఇలాంటి ''పవిత్ర'' సంకుచిత దృష్టికి పాలు పోసి పెంచిన వారిలో దయానందుడు, వివేకానందుడు, కేశవచంద్ర సేన్, తిలక్, మహాత్మాగాంధి వున్నారు. తన గురువు తాంత్రిక విద్యను ఆచరించినా వివేకానంద ఆ సంప్రదాయాన్ని ఈసడించాడు. బహుశ వీరంతా ఒక శతాబ్దం ముందుంటే నేటికీ కళాఖండాలుగా మిగిలిన దేవాలయాల్ని, వాటిపై వున్న శృంగార శిల్పాల్ని నాశనం చేయించే వారే.

అందానికి వ్యతిరేకంగా బోధించే వారికీ, మత మార్పిడికై అందాన్ని చెరిచే వారికీ తేడా లేదు. రక్తమాంసాలలో సజీవంగా రూపానికి అతి సన్నిహితంగా వుండగలిగింది కళాఖండమే. మొదటిది ద్వేషించడానికీ, రెండవ దానికీ మధ్య తేడా వామనుడి తొలి పాదానికీ రెండవ అడుగుకూ వున్న వ్యత్యాసమే!

[(''Source'' ఆధారం):Esthetical Norm and Value Modification in Modern India]

## మేధావుల సహకారం కావాలి

20వ శతాబ్దంలో భౌతికశాస్త్ర ప్రపంచంలో రెండు సిద్ధాంతాలు తలమానికంగా వెలిశాయి – అవి సాపేక్ష సిద్ధాంతాలు (థియరీ ఆఫ్ రిలెటివిటీ), మరొకటి క్వాంటమ్ థియరీ (పరిమాణాత్మ ప్రమాణ సూత్రం). మన భౌతిక ప్రపంచంపై యీ గంభీరమైన భావనలు సూత్రాయుతంగా అవతరించాయి. ఈ భౌతిక ప్రపంచాన్ని (విశ్వం) వివరీకరించడంలో క్వాంటం మెకానిక్స్ అసాధారణ విజయం సాధించింది. క్వాంటం థియరీ గణనీయమైన విజయాన్ని సాధించినప్పటికీ కొన్ని ప్రాథమిక తాత్విక సమస్యలు దీన్ని వ్యక్తీకరించడంలో దీని ప్రభావాన్ని చెప్పడంలో తలెత్తుతున్నాయి. అవి యీ క్రింది ప్రశ్నల రూపంలో మిసిమి పాఠకుల సౌకర్యంకోసం పొందుపరుస్తున్నాము. తగిన రచనలు కావాలి ప్రచురణార్థం.

A. How the self, though 'divided', Yet experiences an underlying Identity?

B. How the self is at once a constituent of this universe and yet distinct?

C. How the self linked to every other entity in the universe is useful and Creative?

D. What Constituets Consciousness can the mind (of Consiousness) be explained? On the basis of laws of Physics which are operative in the Universe?

(ఊహాజనితం ఇంటర్వ్యూ)

# రామస్వామి చౌదరితో మధురవాణి

- పురాణం సుబ్రహ్మణ్య శర్మ

(సూతాశ్రమంలో రామస్వామి చౌదరి గారు సిగరెట్ దర్జాగా పీలుస్తూ)

**రామస్వామి :** ''పాయక పూర్వగాథలని ప్రత్నకవీంద్రులు నేటి దాక రా
మాయణ భారతాది కృతులన్నియు వ్రాసిరి త్రిప్పి త్రిప్పియే
దోయొక కబ్బ మంచుఁదలకొక్కఁటి యక్కఁట నూతనాంశమేదో
యొకటేనియుం దెలుపనోపని గ్రంథ సమూహమేటికో''

**మధురవాణి:** నూతనాంశాలని మీరనుకున్న వాటిని మీకు వదిలేశారేమో! (నవ్వు)

**రామస్వామి :** నేడు హైందవమున వేదములు పైదొలగినవి. ఉపనిషత్తులు తపతపలాడుచు న్నవి. స్మృతులు శిరసుపైకి, పురాణములు బుజములపైకి, ఆచారములుర్రు పైకి ఎక్కి హిందువుల నణగు ద్రొక్కుచున్నవి. ఈ పైశాచిక శాసనములో కులవైషమ్య మొకటి. ఇది కావ్యజగత్తులోకి కూడ ప్రాకినది. కట కటా!

**మధురవాణి:** వేశ్యలు సంస్కృతం చదువుకోవచ్చు నన్నారే - ఇంకెవరికీ పర్మిషను లేదు.

**రామస్వామి :** అప్పకవి శూద్రుల రచనలను గూర్చి - పాయసమైనను మృష్టాన్నమైనను సంస్కార పక్వముగానిచో హవ్యమునకు పనికి రాదన్నాడు.

**మధురవాణి:** అందుకే పాపం చిన్నయ సూరిగారిని ''చిత్, నయ, సూరి'' అన్నారు. అంటే జ్ఞానమును దొంగిలించుటలో సమర్థుడు అని వేళాకోళం చేశారు. పాపం, తరగతిలో శూద్రులు కూర్చుంటే వారిని చూడకుండా వారివైపు వీపు తిప్పి పాఠం చెప్పే వారట పండితులు. గిడుగు రామ్మూర్తి పంతులు గారు తాపీ ధర్మారావు గారి వైపు చూడకుండా పాఠం చెప్పే వారట - వ్యావహారిక భాషను వ్యతిరేకిస్తున్నాడని.

**రామస్వామి :** సూతుడు శౌనకాది మహామునులకు చెప్పినట్లు దేవావైశంపాయనుడు జనమే జయునికిట్లనియె అన్నారు భారతంలో. కాని -

నా పేరన్ వెలయించి నా మెడకు నంటం గట్టి తద్గ్రంథముల్
నాపై నేరము మోపగా దలఁచి యన్యాయంబు న్యాయంబుగా
బాపంబు న్సుకృతంబుగాగ రచియింపంజాలినారెవ్వరో
నాపై బెట్టిన యట్టి యాయగడు మాన్పంగా బ్రయత్నించెదన్.

అని సూతుడు నాతో గోలపెడితే నేను సూతపురాణం, భగవద్గీత తిరిగి రాయాల్సి వచ్చింది, ద్రావిడులు ఆర్యుల పోరాటాలు దృష్టిలో వుంచుకుని.

**మధురవాణి:** కౌరవులదే రాజ్యం పాండవులకు హక్కు లేదని వాదించారట గదా మీరు?

**రామస్వామి :** అందుకోసం కురుక్షేత్ర సంగ్రామం వ్రాశాను. నాతో పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కూడా కలిశారు.

**మధురవాణి:** ఇదంతా మీ ఆంగ్లవిద్యా ప్రభావంవలన పురాణాలను గుడ్డిగా నమ్మక స్వతంత్రంగా చేసిన ఆలోచనల ఫలితం. మీరు రాజ్యాధికారం కౌరవులదేనని వ్రాశారు. కాని మూలంలో స్పష్టంగా ధృతరాష్ట్రుడు అంధుడగుట చేత రాజుకాలేదనీ, పాండురాజే రాజయ్యాడనీ వుంది. కాని పాపం పాండురాజుకి వున్న జ్యేష్ఠభ్రాతృ గౌరవం చేత అతనికి పెద్దరికం యివ్వడం చేతనూ, తమ నిరంతరం దిగ్విజయాలతో రాజధానిలో లేకపోవడం చేతనూ, ధృతరాష్ట్రుడు స్థాన బలిమిచేత వచ్చిన అధికారాన్ని నిలుపుకొని, ధర్మరాజుకి పూర్తి రాజ్యం ఇవ్వాల్సి వుండగా, కొంత రాజ్యం మాత్రం యిచ్చి, దుర్యోధనుడికి ప్రధానమైన హస్తినాపురం సంక్రమించేట్లు ఏర్పాట్లుచేశాడు. అంచేత కౌరవులదే అన్యాయం; పాండవులది కాదు స్వామీ!

**రామస్వామి :** పంచమ వేదానికి నేను పట్టించిన దుర్గతికి నన్ను మతద్రోహి అన్నారు. ఆ రోజుల్లో తిరుపతి వేంకట కవుల పాండవ నాటకాలు వీర విహారం చేసేవి. కౌరవులు అధర్మపరులని ధర్మరాజు ధర్మపక్షం అవలంబించి శ్రీకృష్ణుని సాయంతో ధర్మప్రతిష్ఠాపన చేశాడనే విశ్వాసం ప్రగాఢంగా వుంది. అప్పుడే నాకు భారత కథలోని అంతరతత్వం పై అనుమానాలు కలిగాయి. హేతువాద దృక్పథంతో భారతం క్షుణ్ణంగా చదివా. నా కురుక్షేత్ర సంగ్రామం రెండవ అంకంలో సంజయపాత్ర ముఖంగా కురుసామ్రాజ్యాధిపత్యం ధృతరాష్ట్రుని యందే కాని పాండురాజుకు లేదని హేతుబద్ధంగా చెప్పాను. మేము చేయని పని నీవు చేసినావు అని చెళ్ళపిళ్ళవారు అన్నారు కూడా మెచ్చుకుంటూ.

**మధురవాణి:** అయితే పాత పురాణాలను ఇతిహాసాలను మీరు తూర్పార పట్టడం సంఘ శ్రేయస్సు ఎలా అవుతుంది?

**రామస్వామి :** మానవ సంఘం బాగుపడాలంటే కాలాన్ని బట్టి క్రొత్త నిర్మాణాన్ని సాగిస్తూ వుండాలి. కాని అంతవరకూ సంఘంలో వున్న కట్టుబాట్లు దీన్ని సాగనివ్వవు. కాబట్టి వాటిని త్రెంచాలంటే కురుక్షేత్ర సంగ్రామంతో మొదలెట్టాలి.

**మధురవాణి:** డి.యల్. రాయ్ నాటకాల్లో శంబుకవధ గురించిన నాటకం కూడా వుందిట గదా!

**రామస్వామి :** అయితే సామాన్యులకు తెలియదు.

**మధురవాణి:** మీరే శంబుకులు. కాని శంబుక వధ శ్రీరామునిది. అప్పటి వ్యవస్థ అలా వుండేది. ఎందుకు వుండేది అని ప్రశ్నించడం వేరే విషయం. నేరాలు ఎలాంటివైనా దండన నేటి పాకిస్తాన్‌లో వలె వుండేది?

**రామస్వామి :** రాజా రాష్ట్ర కృతం పాపం రాజపాపం పురోహితః
అన్నట్లు ఆ పాపం వసిష్ఠుడి మీద పడింది.

**మధురవాణి:** చౌదరిగారు రామాయణంలో ఆర్య ద్రావిడ సంఘర్షణను తెచ్చిపెట్టారు. రాక్షసులు ద్రావిడులనడానికి ఆధారాలేమిటి?

**రామస్వామి :** ఆర్యజాతి ద్రవిడ జాతిని ఓడించి అసురులనీ, దస్యులనీ పిలిచి, వారిని దుర్మార్గులుగా నిరూపించి, జయించి, బానిసలుగా జేసికొని శూద్రులుగా

వ్యవహరించి వారికేహక్కులు లేకుండా చేశారు. పురాణాలు స్మృతులు యీ భిన్నజాతుల కొరకు ఏర్పరచిన శాసనాలే. కనుక యవి ప్రమాణాలు కావు. పాశ్చాత్య పండితులు ఆర్యులు పైనించి వచ్చారనీ ద్రావిడులు యిక్కడి వారేననీ నిర్ధారణ చేశారు.

**మధురవాణి:** రాక్షసులు ద్రావిడులు అనడానికి ఆధారాలు లేవుట. అసలు ఆర్యులు ఎక్కడ నుంచి వచ్చారో యింకా తేలలేదు. ద్రావిడులు కూడా యిక్కడి వారు కాదని కొందరంటే, ఆర్యులూ ద్రావిడులూ రెండు విభిన్న జాతులవారు కారనీ రెండు భాషలు మాట్లాడే ఒకే జాతి వారనీ కొందరంటున్నారు. కనుక జన్మతః దాక్షిణాత్యులైన ద్రావిడులను విదేశీయులైన ఆర్యులు ఆక్రమించారన్న కవిరాజు గారి ఊహ సరైనది కాదు. పైగా రాముడు మీకు అర్థం కానంత మాత్రాన రాక్షసులు అంతా మంచివాళ్ళు ఎట్లా అవుతారు?

**రామస్వామి :** నా శిల్పం అంతా ఆర్య ద్రావిడ సంఘర్షణ మీద పూర్తిగా ఆధారపడివుంది. అది రామాయణమైనా, శంబుక వధ అయినా మరోటీ మరోటీ అయినా-

**మధురవాణి:** రామస్వామి నాయకర్ ప్రభావం మీమీదేమైనా వుందా?

**రామస్వామి :** రామాయణం నేనూహించినట్లు నేన్చెప్పినట్లే జరిగి వుంటుంది.

**మధురవాణి:** ఆర్యుల సంస్కృతి విజ్ఞానం మనకు బాగా తెలుసు. మీరు మంచివారంటున్న రాక్షసుల గురించి వారి మంచితనం గురించీ మనకేమీ తెలీదే? తాటకిని శూర్పణఖను మీరూ నార్లగారూ మెచ్చుకున్నార్ట!

**రామస్వామి :** మనవాళ్ళు పవిత్రంగా భావిస్తున్నవన్నీ ఎలా దోష భూయిష్టాలో చెప్పాను. స్త్రీ పురుషులు శాస్త్ర దాస్యం నుంచి, భావదాస్యం నుంచి విముక్తులైతే వారికి యింక నేనేమీ చెప్పక్కర్లేదు.

**మధురవాణి:** ఏది ఏమైనా మొత్తానికి మీరు తెలుగువాళ్ళ మూతికి బిగించిన తాళాన్ని తీశారు. మిమ్మల్ని భావ విప్లవకారుడు అనకపోతే చాలా ప్రమాదం.

**రామస్వామి :** ఏం ప్రమాదం?

**మధురవాణి:** మీరు అదిగాకపోతే ఇంకేమిటి? ఏమీ కాకుండా ఎలాపోతారు?

**రామస్వామి :** పదహారణాల తెలుగు బిడ్డను.
కంచి కోటల కంచు తల్పులు
ఖంగు ఖంగున మ్రోగునప్పుడు
తంజనగరపు కోట గోడలు
చెంగు చెంగున ఎగురునప్పుడు
తిరువటంబునఁ జేరసేనలు
కెవ్వు కెవ్వున నరచునప్పుడు
మధురకోట యగడ్తలన్నియు
రివ్వు రివ్వున దూకునప్పుడు
తెలుగు వారలు పిరికి వారలా
తెలుగు బిడ్డా! తెలిసికొనుమా!

**మధురవాణి:** 'మందే రా' ఒక మాటు పాడండి నా కోసం!

**రామస్వామి :** బ్రహ్మపురము మందేరా
పర్లాకిమిడి మందేరా
కాదని వాదుకు వస్తే
కటకం దాకా మన్దేరా!

చెన్నపురము మందేరా
చెంగల్ పట్టు మందేరా
కాదని వాదుకు వస్తే
తంజావూరును మందేరా!

బస్తరెల్ల మందేరా
జయపూరంతా మందేరా
కాదని వాదుకు వస్తే
నాగపూర్ దాకా మందేరా!

బెంగుళూరు మందేరా
బళ్ళారీ మందేరా
కాదని వాదుకు వస్తే
కన్నడ మర్ధం మందేరా!

గోలుకొండ మందేరా
తెలంగాన మందేరా
కాదని వాదుకు వస్తే
నైజామంతా మందేరా!

దేవికోట మందేరా
పుదుక్కోట మందేరా
కాదని వాదుకు వస్తే
కాండీ దాకా మందేరా!

**మధురవాణి:** చబాష్! మీరు పది కాలాలపాటు చల్లగా వుండాలి. మీ తెలుగు పౌరుషానికి తెలుగు అభిమానానికి హద్దులు లేవు. హిందీ అంటే పడదుగా - సంస్కృతం అంటే కూడా మీకు పడదా?

**రామస్వామి :** సంస్కృతము దేవభాషయని నిన్న మొన్నటి వరకు దానిని ద్విజులే చదువవలె ననిరి. మనలను దాస్యమునందుంచెడు భాష మనకెందులకు? మనము తెలుగు వారము. తెలుగు మనకు తల్లిభాష. తెనుగు తేట అని ప్రశంసించు వారు తెనుగునుడి కారముతో వ్రాయరేమి?

**మధురవాణి:** మీరు వక్త కారు. పద్యం బాగా చదవలేరుట. సోక్రటీసులాగ డైలాగ్స్ బాగా చెప్తారట. నిజమా?

**గిరీశం :** (ప్రవేశించి) నిండు మనమ్ము నవ్య నవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము. గురువుగారు పెడసరంగా మాట్లాడినా వారి డైలాగ్స్ చమత్కారాలూ మిరియాలూ. నేన్చెబుతాను విను - ''మోడ్రన్ కవులంటే వారికి చిరాకు'' 'ధర్మం కృతయుగంలో నాలుగుపాదాలు నడిచింది' అన్నారెవరో.

'ఆ కాలంలో అందరూ పశుప్రాయులన్న మాట' అని వెంటనే మాటకు మాట జవాబిచ్చారు గురూజీ. ఒకరు రామకోటి వ్రాసి వారిని మెప్పించుటకు వచ్చారు.

''యిన్ని సంవత్సరాల నుండి వ్రాస్తున్నా రెండక్షరాలు సరిగా వ్రాయలేక పోయావు'' అన్నారు చటుక్కున.

అంగలకుదురులో ఒక ఉపన్యాస చక్రవర్తి కవిరాజు గారిని ''మీరు మ్లేచ్ఛులు గదా. నేను స్వచ్ఛమైన బ్రాహ్మణున్ని'' అన్నారట. కవిరాజు ''మీరు మనుస్మృతిని అంగీకరిస్తారు గదా'' అని అడగ్గా ''తప్పకుండా'' అన్నాడట ఆ బ్రామిన్. ''వింధ్య అవతల ప్రదేశమంతా మ్లేచ్ఛ దేశమని మనుస్మృతి చెప్తున్నది'' అనగా అంత గొల్లుమన్నార్ట సడెన్గా. పర్వతనేని వీరయ్యచౌదరిగారు తమ

స్వగ్రామం అయిన పెదనందిపాడులో కవిరాజుగారితో షికారుకనివెళ్ళి అక్కడొక డొంకలో కూర్చున్నారు. ఆ డొంకలు చాలా విశాలంగా వున్నాయి. ఆ డొంకలను చూపిస్తూ ''ఇంత విశాలమైన డొంక ఎక్కడా లేవు'' అనగానే చౌదరిగారు తడుము కోకుండా'' అవును పనికి మాలిన భూములైనపుడు డొంకలు లేకేమవు తాయి. సహారా ఎడారిని చూసి మెచ్చుకున్నట్లుంది నీమెచ్చికోలు'' అని వారిని కంగు తినిపించారుట మా గురువు.

**మధురవాణి:** చాలా సంఘటనలను గుర్తుచేసి నవ్వించారు గిరీశం గారూ - చౌదరిగారి జీవితానికి మూల సూత్రం ఏది?

**గిరీశం :** హేతువాదతత్వం. సత్యాన్వేషణ. వివేచనాశక్తిని మానవ వ్యవహారాలకు సమస్యలకు అన్వయింప జేయటమే హేతువాదం అన్నాడు యం.యన్. రాయ్. మరొక్క మాట - రామస్వామి గారు బాల్యంలో చేతబడి చేసిన చెల్లక్కి పలుదోము పుల్ల కోసికొని అక్కడి డబ్బుల్ని జేబులో వేసుకుని మంత్రించిన బెత్తాన్ని యింటికి తెచ్చేవారట. అలాగే విదేశాల్లో 13వ నెంబరు గదిలో వుండే వారట.

**మధురవాణి:** హిందూస్థానీ కర్ణాటక సంగీతంలోని భేదాలు, సైగాల్ మ్యూజిక్కు, న్యూథియేటర్స్ సినిమాలు, హిందీ వ్యతిరేకోద్యమం యివన్నీ మీకిష్టమైనవే.

గుదురని జంకు చూపు గమి గూపులు గల్గియు నా మనస్సులో
మెదలుచు నుండెఁగా ప్రతి నిమేషము మత్కులకాంత నేటికిన్.

**రామస్వామి :** పున్నమ్మ మహాసాధ్వి. ప్రసవంలో గతించింది. మహాభక్తురాలు; నిరంతరం పూజలు చేస్తూ వుండేది.

**మధురవాణి:** ఈమె గోపీచంద్ గారి తల్లా?

**రామస్వామి :** అవును. అట్లూరి వారికి మా త్రిపురనేని వారికి చాలాకాలంగా బంధుత్వం వుంది. మా అత్తారివూరు అంగలూరికి దగ్గరగా వున్న చౌటపల్లె. ఆమెకు అయిదవ ఏడు. నాకు పదేళ్ళు. నేను 1914లో ఇంగ్లండు వెళ్ళుటప్పుడు వాళ్ళను అంగలూరులో దించి వెళ్ళా.

**మధురవాణి:** బ్రాహ్మణులలో కొంతమంది మాంసాహారులవుతున్న యీ కాలంలో మీరు పూర్తి శాకాహారులు కావటం ఆశ్చర్యకరమే.

**రామస్వామి :** జీవహింస చేసి జీవింతుననుకంటెఁ:
జెట్ట యెందుఁ గూడఁ బుట్టఁబోదు
జీవహింస మాని జీవింపరాదొకో...

**మధురవాణి:** మీరు శాకాహారులు కావడం కంటె కూడా మరో గొప్ప సంగతి మీరు తెనాలి ఛైర్మన్‌గా వున్నపుడు మారెమ్మ తెనాలి మీద విరుచుకుపడినపుడు జాతర్లకి బలులకి మీరు ముక్తిచీటీ యివ్వలేదట గదా! విశ్వాస రాహిత్య తీర్మానం తెచ్చినా మీరు ఆదర్శభ్రష్టులు కాలేదు. మీరు వాక్శూరులు కాదు. కార్యశూరు లనిపించుకున్నారు. ధన్యులు.

**రామస్వామి :** మనసు నచ్చునెడల మన్నింపగా వచ్చు
మనసు నొచ్చు నెడల మానవచ్చు

గాని వివరమేమి కనకుండ వినకుండ
బరుల బ్రువ్వ దిట్ట ఫలము కలదె?

మధురవాణి: బ్రాహ్మణత్వం సమాజ వికాసాన్ని సంపూర్ణంగా అరికట్టింది. వర్ణాశ్రమ ధర్మాలు ప్రతిష్ఠాపించింది. జాతి విభేదాలు రెచ్చగొట్టింది. బానిసత్వ దశను నిలప పాటుబడింది. జన్మకారణం గానే పూజలు పొందే హక్కులు కల్పించింది. ఇంతేనా మీరు చెప్పదలుచుకున్నది?

రామస్వామి : దక్షిణాఫ్రికా యందు నిర్దయులు తెల్ల
వారు భారతీయుల పెట్టు పాట్లు గాంచి
గొల్లుమని యేడ్చు నెంతొ గగ్గోలు పడుచు
బనవుచుండును నీ నాటి బ్రాహ్మణుండు.

కులాభిమానముతో నందఱి కంటె తానెక్కువయని బ్రాహ్మణుడనుకొను చున్నట్లే, కొందరి కంటె తానెక్కువయని యీ యభిమానము గలవాడను కొనుచున్నాడు.

మధురవాణి: సరే - ఐతే నన్నయ ఆదికవి కాడంటారా చౌదరీగారూ?

జోలపాటలు నేర్చి యేలపాటలు నేర్చి
ప్రోడపిల్లయై పాతర లాడనేర్చి
తెలుగు కబ్బపుకన్నియ తెలివితోడ

ఇంతియే కాని నన్నయ వింతగాగ
పుణికి గంటము చేపట్టి కణతలదర
కైత పుట్టించె నసుమాట కల్లమాట-

మధురవాణి: ఇప్పుడు శూద్రవర్గం పైవర్గాల మీదకు విప్లవం చేసి అధికారాన్ని వశం చేసుకుంది. ఇక దళితవర్గం యీ శూద్రవర్గం మీద విప్లవం చేస్తున్నది అధికారాన్ని వశం చేసుకుందుకు.

రామస్వామి: (సిగరెట్ బాగా పీలుస్తూ) ఏమున్నది? బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులందరి మీదా దళితులెక్కిపోతారు. ప్రతిభా గితిభా జాంతానై.

మధురవాణి: జస్టిస్ పార్టీలో పెద్దలు మీకు కోరుకుంటే జడ్జీ పదవులిచ్చినా మీరు వద్దని పేదరికాన్నే వరించి నిజాయితీతో గడిపారు అని వున్నవ వారన్నారు. ఆ విలువలు లేనప్పుడు, మీ వాళ్ళిప్పుడు ఎలా జీవిస్తున్నారో చూస్తే వీళ్ళ కోసమా నేను పోరాడింది అని మీరు ఫీలవుతారు. నిరాడంబరులైన మిమ్మల్ని ఆంధ్రదేశం చాలా అపార్థం చేసుకుంది. అందరి కోసం పాటుబడ్డా మీరు కొందరి మనిషే అనుకున్నారు. సారీ! చౌదరీగారూ! మన సంస్కృతి నించి మీరు తిరస్కరించిందే ఎక్కువ. స్వీకరించింది తక్కువ.

(సమాప్తం)

# మనస్సు పనిచేసే తీరు

రచన: అట్లూరి వెంకటేశ్వరరావు

మనస్సు ఎలా పని చేస్తుందో చాలా మందికి తెలియదు. అనేకులు అపోహలతో ఎన్నో అయోమయ పరిస్థితులను ఎదుర్కొని ఇబ్బందుల పాలవుతున్నారు. మనస్సు పనితీరును గూర్చి ప్రపంచ వ్యాప్తంగా జరిగిన పరిశోధనా ఫలితాల సారాంశాన్ని పరిశీలిద్దాం.

మెదడు, మనస్సు రెండూ సమిష్టిగా మన ఆలోచనలకు రూపురేఖలు దిద్దుతాయి. మెదడుకు భౌతిక స్వరూపం వుంది. మనస్సు వస్తువు కాదు. మనస్సు క్రియ మాత్రమే. మెదడులోని వెయ్యి కోట్ల కణాల కార్యక్రమాల సమన్వయ క్రియనే మనస్సు అంటాం. కంప్యూటర్ పరిభాషలో చెప్పాలంటే మెదడు హార్డువేరు. మనస్సు సాఫ్టువేరు. ఈ రెండు కంప్యూటరు పనికి అవసరం. అట్లాగే మెదడు మనస్సు కలసి పనిచేయటం మూలంగానే మన జీవితానికి అవసరమైన నిర్ణయాలు చేసుకొని అమలు పర్చుకోగలుగుతున్నాం. అందువల్లే మనస్సును చూడలేము. కాని దాని ప్రభావాన్ని అనుభూతిగా పొందుతాం. ఉదాహరణకు ప్రభుత్వాన్ని దాని కార్యకలాపాలను విడదీయలేము. ప్రభుత్వం తన కార్యకలాపాలను వివిధ వ్యవస్థల సమన్వయంతో కొనసాగిస్తుంది. చట్టాలను ప్రజా ప్రతినిధులు చేస్తే కార్యనిర్వాహకపు సిబ్బంది వాటిని అమలుపరుస్తారు. అమలులో ఎదుర్కొన్న అడ్డంకులను పరిష్కరించటానికి న్యాయ వ్యవస్థ కృషి చేస్తుంది. వ్యక్తిగతంగా ప్రజా ప్రతినిధులు గాని, మంత్రులుగాని, కార్య నిర్వాహకపు సిబ్బంది గాని, పోలీసులు గాని, న్యాయాధికారులు గాని ప్రభుత్వం కాదు. ప్రజలు ప్రభుత్వ ప్రత్యక్ష ప్రభావాన్ని వివిధ వ్యవస్థల పనితీరు ద్వారా అనుభవిస్తూ వుంటారు. వివిధ వ్యవస్థల కార్యకలాపాలను క్రమబద్ధంగా నిర్వహించే క్రియను ప్రభుత్వమని అంటారు. అందువల్ల ప్రభుత్వానికి భౌతిక రూపం ఉండదు. కాని భౌతిక వ్యవస్థల ద్వారా ప్రభుత్వం తన అధికారాన్ని చలాయిస్తుంది. ప్రజలు గుర్తించే ప్రభుత్వం సమన్వయ క్రియ. అట్లాగే మనస్సు మెదడులోని వెయ్యి కోట్ల కణాల పనిని సమన్వయపరుస్తూ మన జీవితాన్ని గడపటానికి వీలు కలిగిస్తుంది. మెదడులోని ప్రతికణానికి శరీరాంతర్భాగాలతో భౌతిక సంబంధం వుంటుంది. మనస్సు మెదడులోని కణాలను ప్రేరేపించి రసాయన ప్రక్రియల ద్వారా శరీరాంగాలలో స్పందనను కలుగజేస్తుంది. ఈ స్పందనలే మన ప్రవర్తనగా బహిర్గతమవుతాయి. మెదడుని కణాలను ప్రేరేపించటానికి మనస్సు ఆలోచనలను వాడుకొంటుంది.

ఆలోచనలు మెదడులోని కణాల చైతన్యం కలుగజేసి శరీరాంతర్భాగాలను కంపింపజేస్తాయి. జ్ఞానేంద్రియాలు అందించిన సమాచారాన్ని మెదడు విశ్లేషించి మనస్సు సహకారంతో భావావేశాలకు రూపకల్పన జేస్తుంది. అట్లాగే మనస్సు తనంత తానే ఆలోచనలను ప్రేరేపించి మెదడులోని కణాలకు పనిని కల్పిస్తుంది. మెదడులోని కణాలు రసాయనిక సంయోగం చెంది రక్తప్రసరణ నాడీ మండల వ్యవస్థను రెండు మార్గాలలో ప్రభావితం చేస్తాయి. రక్త ప్రసరణ

వ్యవస్థలో కలిసిన రసాయనాలు శరీరంలోని రసాయన గ్రంథులను ప్రేరేపించి మనం చేపట్టబోయే కార్యక్రమానికి, అవసరమైన శక్తిని సమకూర్చుతాయి. అదే క్షణంలో నాడీ వ్యవస్థను ప్రభావితం చేసిన రసాయనశక్తి, శరీర కండరాలలోని అంతర్భాగాలయిన కణాలను కంపింపజేసి మన ఆలోచనలకు అనుగుణంగా శరీర చైతన్యాన్ని అజమాయిషీ చేస్తుంది. రక్తప్రసరణ నుండి అందిన శక్తి నాడీమండల ప్రేరణ వల్ల చైతన్యమైన కణాలకు అండగా వుండి మన ప్రవర్తనకు రూపకల్పన చేస్తుంది. అందువల్ల మన మనస్సుకు శరీరంలోని ప్రతి అణువును అజమాయిషి చేయగల స్థోమత వుంది.

మనస్సు స్థూలంగా స్వయం ప్రతిపత్తి గల రెండు అంతర్ వ్యవస్థలుగా వ్యవహరిస్తుంది. ఆ అంతర్ వ్యవస్థలను మనం బాహ్య మనస్సు, అంతర్ మనస్సు అని వ్యవహరిస్తాం. బాహ్య మనస్సు మనస్సురణలో మెదిలే ఆలోచనలకు కేంద్ర స్థానం. అంతర్ మనస్సు అసంకల్పిత ప్రవర్తనకు కేంద్రస్థానం. అంతర్ మనస్సు బాహ్య మనస్సు కంటే 10 రెట్లు అధిక శక్తితో మన శరీరాంతర్ భాగాలపై అధికారాన్ని చలాయిస్తుంది. అందువల్లే బాహ్య మనస్సు ప్రమేయం లేకుండానే అంతర మనస్సు అనేక అసంకల్పిత, అసంగత ప్రవర్తనలకు రూపకల్పన చేస్తుంది. తత్ఫలితంగా మనం ఎన్నో వూహించని ఇబ్బందులను అప్పుడప్పుడు ఎదుర్కొన వలసివస్తుంది. ఉదాహరణకు ఒక పరిచయం వున్న వ్యక్తిని చూచినప్పుడు అతని ముఖాన్ని గుర్తిస్తాం. అతని పేరు చట్టుక్కున గుర్తుకు రాదు. అట్టి సందర్భాలలో బాహ్య మనస్సు మన మతిమరుపును కప్పిపుచ్చటానికి వ్యూహాన్ని రూపొందించి అమలుపరుస్తుంది. ఆ క్షణంలో మన అంతర మనస్సు స్వయం ప్రతిపత్తితో మన మతిమరుపును గూర్చిన వివరాలను ఎదుట వారికి తెలియజేస్తుంది. అంతర్ మనస్సు యొక్క స్వతంత్ర భావ వ్యక్తీకరణను అసంకల్పిత ప్రవర్తనగా వ్యవహరిస్తాం. అంతర్ మనస్సు శరీరంలోని రసాయన గ్రంథులను కండరాలను తనంత తానే ప్రేరేపించి, తన నిర్ణయాలను అమలు చేసుకోగలుగుతుంది. అందువల్లే అసంకల్పితంగా ముఖ కండరాల కదలికల ద్వారా, కనుసంజ్ఞల ద్వారా, అంగ విన్యాసాల ద్వార, ఉద్రేక, ఉద్వేగాల ప్రభావంతో మనం భావావేశాన్ని తరచు బహిర్గతం చేస్తూ వుంటాం. అసంకల్పితంగా అంతర్ మనస్సు చేసే వ్యవహారాలు బాహ్య మనస్సుకు అంతర్ మనస్సుకు వున్న సంఘర్షణ మూలంగా స్పష్టంగా కన్పిస్తుంది. అందువల్లే ఎంత కృషిచేసినా మన మతి మరుపును ఎదుటి వారి దృష్టి నుండి మరుగు పర్చలేకపోతాం. ఎదుటివారు మన ఇబ్బందిని గుర్తించి తమ పేరును చెప్పి మన అంతర్గత సంఘర్షణలను నివారించటానికి తోడ్పడతారు. అంతర్ మనస్సు, బాహ్యమనస్సు ఒకే ధోరణిలో వ్యవహరిస్తే, మన శక్తి అంతా సమీకృతంగా మన శరీరాంగాల సమన్వయానికి ఉపయోగపడుతుంది.

బాహ్య మనస్సు, అంతర్ మనస్సు రెండూ కూడ మెదడులో వున్న జ్ఞాపకాలను, తమ అవసరాల మేరకు తిరగతోడ కలుగుతాయి. మనం చేసే ప్రతి నిర్ణయం వెనక మన జ్ఞాపకాల ప్రభావం ప్రత్యక్షంగాను, పరోక్షంగాను వుంటుంది. పుట్టినప్పటి నుండి కలిగే అనుభవాల అనుభూతులు మెదడులో జ్ఞాపకాలుగా నిక్షిప్తమౌతాయి. మన అభిప్రాయాలు, నమ్మకాలు, విశ్వాసాలు, వైఖరులు, విలువలు జ్ఞాపకాల రూపంలో మెదడులో రికార్డయి వుంటాయి. మెదడులోని కోట్లాది కణాలు బాహ్య మనస్సు, అంతర్ మనస్సు ప్రేరణల వల్ల ఈ

జ్ఞాపకాలను తిరగదోడి మంచి, చెడ్డలను విశ్లేషించి మన సమస్యా పరిష్కార శక్తిని రూపొంది స్తాయి. సమస్య వర్తమాన కాలానికి సంబంధించినదైనా, భూతకాలంలో జరిగిన సంఘటనలను భవిష్యత్తులో రాబోయే పరిణామాలను మనస్సు దృష్టిలో పెట్టుకొని పరిష్కారాలను సూచి స్తుంది. ప్రతి నిర్ణయం వెనకాల ఎంతో క్రియ వుంటుంది. మెదడులోని కణాలు అంచెల వారిగా తమ పరిజ్ఞానాన్ని తమలో తాము చర్చించుకొని సారాంశాన్ని పరిష్కార శక్తిగా బహిర్గతం చేస్తాయి. ప్రతి ఆలోచన వెనుక కోట్లాది కణాల శ్రమశక్తి వుంటుంది. ముఖ్యంగా మనం చూచిన విషయాలు, నేర్చుకొన్న విషయాలు, ఇతరుల నుండి తెలుసుకొన్న విషయాలు, పుస్తకాలలో చదివిన అంశాలు, ప్రత్యక్షంగా కలిగిన అనుభవాలు జ్ఞాపక శక్తిలో రికార్డయి వుంటాయి. విషయ పరిజ్ఞానం జ్ఞాపకశక్తి రెండూ తమలో తాము సంప్రదించుకొని తెలివి తేటలకు రూపకల్పన చేస్తాయి. మన తెలివితేటలు విషయ నిర్ణయశక్తిగా సమస్యలను పరిష్కరిస్తాయి. ఈ పనులన్నీ క్షణకాలంలో జరిగిపోతాయి. అందువల్లే మనస్సు మెదడుల పనితీరు మనకు వివరంగా కన్పించదు. ప్రతి ఆలోచన వెనుక ఎంతో క్రియ వుంటుంది. ప్రతి వ్యక్తికి ప్రత్యేకమైన అనుభవాలు వుంటాయి. కాబట్టి వ్యక్తుల ఆలోచనల రీతులలో భిన్నత్వం చోటు చేసుకొంటుంది

బాహ్య మనస్సు అంతర్ మనస్సుల మధ్య హద్దులు, పరిస్థితులను బట్టి ఎప్పటికప్పుడు మారుతాయి. ఒక్క క్షణంలో మన స్ఫురణలో లేని అంశం చటుక్కున అంతర్ మనస్సు నుండి గెంతి మన పరిగణనలోకి వస్తుంది. మనం ప్రయత్నించిన కొద్దీ బాహ్యమనస్సు పరిధి విస్తరిస్తుంది. తత్ఫలితంగా అసంకల్పిత ప్రవర్తనకు కట్టడి ఏర్పడుతుంది. బాహ్య మనస్సు ద్వారా అంతర్ మనస్సును ప్రభావితం చేయడానికి సావకాశం వుంది. హిప్నటిజం లాంటి ప్రక్రియల ద్వార అంతర్ మనస్సును బాహ్యమనస్సుకు తోడ్పడేటట్లు చేయవచ్చును. ఏకాగ్రతతో బాహ్యమనస్సును ప్రేరేపించి అంతర్ మనస్సును మన అవసరాల మేరకు ఉపయోగించు కోవచ్చు. అంతర్ మనస్సు బాహ్యమనస్సుకు సంపూర్ణ సహకారం అందించక పోతే మనశక్తి సంపూర్ణంగా వుపయోగంలోనికి రాదు. మన వ్యక్తిత్వ లోపాలన్నీ బాహ్య మనస్సు, అంతర్ మనస్సు తమలో తాము పోట్లాడుకొనుట వల్లే ఏర్పడ్డాయి. ఉదాహరణకు ఒక విద్యార్థి తన హోమ్ వర్కు చేయడానికి మొదలు పెట్టుతున్నప్పుడు అతని అంతర్ మనస్సు సినిమాకు వెళ్ళమని ప్రోత్సహిస్తుందనుకోండి. అప్పుడు అంతర్ మనస్సు అతని బాహ్య మనస్సును లోబర్చుకొని సినిమా వైపు మ్రొగ్గేటట్లు చేస్తుంది. అట్టి సందర్భాలలో అంతర్ మనస్సు కలుగజేసే విధ్వంసకపు ప్రేరణను గుర్తించితే బాహ్య మనస్సును ఉత్తేజపర్చి హోం వర్కు చేయవలసిన అవసరాన్ని అంతర్ మనస్సుకు నచ్చజెప్పే వ్యూహాన్ని చేపట్టాలి. అట్లా అంతర్గత సంవాదం ద్వారా అంతర్ మనస్సును ఒప్పించి హోం వర్కు చేయడానికి కృషి చేస్తే ప్రయోజనం వుంటుంది. ఇట్టి ప్రయత్నానికి దృఢమయిన లక్ష్యం, ఏకాగ్రత, పట్టుదల, కష్టపడి పనిచేసే స్వభావం, దీక్ష అవసరం. ఇట్టి వ్యక్తిత్వ లక్షణాలను కలిగివున్న వారు తమ అంతర్ మనస్సును తమ కృషికి తోడ్పడే విధంగా వుపయోగించుకో గలుగుతారు. మన విజయానికి అంతర్ మనస్సు యొక్క సహకారం అవసరం. అట్టి సహకారాన్ని పొందటానికి అవసరమైన వ్యూహాలను చేపట్టే నైపుణ్యాన్ని ప్రతిఒక్కరు సంతరించుకోవాలి.

అట్టి వ్యూహాలను చేపట్టి వ్యక్తిత్వ లోపాలను సరిదిద్దుకొంటూ సామర్థ్యాన్ని క్రమక్రమంగా వృద్ధి చేసుకోవాలి.

మన మెదడులోని వివిధ భాగాలు మనస్సు యొక్క భిన్న ప్రవృత్తులకు కేంద్ర స్థానాలుగా వ్యవహరిస్తూ మన ప్రవర్తనకు రూపకల్పన చేస్తాయి. అనగా మన ప్రవర్తనను అజమాయిషి చేసే ఆలోచనలు మెదడులోని నిర్దిష్ట ప్రాంతాల నుండి వుత్పన్నమౌతాయి. మెదడులోని ఎడమ అర్ధ భాగం తార్కిక వాదానికి మూలస్థానం. అట్లాగే మెదడులోని కుడి అర్ధభాగం ఆధ్యాత్మిక చింతనకు కేంద్రం. మన అహంకారం మెదడులోని ఎడమ అర్ధభాగం నుండి ప్రేరేపింప బడుతుంది. అహంకారానికి వత్తాసు పలుకుతూ శాస్త్ర పరిజ్ఞానమను వస్తుగత దృక్కోణం నుండి చూచేటట్లు ఈ కేంద్ర స్థానం ప్రేరణలను కలుగజేస్తుంది. అట్లాగే మెదడులోని కుడి అర్ధభాగం దైవచింతనలను ప్రేరేపిస్తూ ఆత్మగత ఆలోచనలను ఉత్పత్తి చేస్తుంది. పరస్పర విరుద్ధమైన, రెండు దృక్కోణాల నుండి ఏక కాలంలో సమస్యను పరిశీలించే స్తోమతను మన మెదడు కలిగి వుంది. ఈ రెండు దృక్పథాలలో మన మనస్సు ఒక దానిని తరచు సమస్యా పరిష్కార శక్తిగా ఉపయోగించుకొంటుంది. ఇట్లా క్రమ క్రమంగా ఒక దృక్కోణాన్ని ప్రోత్సహిస్తూ మన ఆలోచనలను ఆ ప్రవృత్తి వైపు మొగ్గుచూపుతూ సాగనిస్తే కొంత కాలానికి ఆ ప్రవృత్తే వ్యక్తిత్వంగా స్థిరపడి పోతుంది. ప్రకృతి మనకు అంశాలను సమగ్రంగాను, సంపూర్ణంగాను పరిశీలించి తగు నిర్ణయాలు చేయగల స్తోమతను జన్మతః ప్రసాదించినప్పటికి మన పెంపక ప్రభావం ఏదో ఒక ప్రవృత్తిని ఎక్కువగా ఇష్టపడేటట్లు చేస్తుంది. అందువల్లే కొందరు ఎప్పుడు తర్కిస్తూ ఇతర్లను విమర్శిస్తూ తాము పట్టిన కుందేలుకు మూడే కాళ్ళంటు వ్యవహరిస్తారు. మరి కొందరు ప్రతి విషయంలో వాదించ కుండా ఇతర్లతో సర్దుకుపోతూ, తేలిగ్గా జీవితాన్ని సాగించుకొంటూ పోతారు. వ్యక్తుల ప్రవర్తన నుండి వారి ఆలోచలనకు మూల స్థానాన్ని గుర్తించవచ్చు.

మెదడులో వెనుక భాగంలో ఆత్మరక్షణకు వంశాభివృద్ధికి అవసరమైన విషయ పరిజ్ఞానం పొందుపర్చబడి వుంది. ఈ ప్రాంతం నుండి ప్రేరేపించబడే ఆలోచనలన్నీ స్వార్థ చింతనతో స్వలాభం కొరకు ఉపయోగపడతాయి. ఎప్పుడు ఇతర్లను దోచుకొని తాను లాభం పొందాలను కొనే వ్యక్తుల ప్రవర్తన వారి మెదడు వెనుక భాగం నుండి ప్రేరేపించ బడుతుంది. ఏకకణజీవి నుండి మానవ దశ వరకు గత మూడు వందల కోట్ల సంవత్సరాలుగా జీవరాశి తన మనుగడను సాగించుటకు చేసిన ప్రయత్నాల సారాంశం జన్యుకణాల ద్వారా ప్రతి ఒక్కరి మెదడులోని వెనుకభాగంలో జన్మతః నిక్షిప్తమై వుంటుంది. ముఖ్యంగా భూచరాలలో వున్న కోపం పాము బుసు కొట్టినట్లు ప్రతి ఒక్కరిలోను స్పష్టంగా కన్పిస్తుంది. అట్లాగే జంతువులలో వున్న సంఘీభావం, స్వజాతి పట్ల వున్న ప్రేమాభిమానాలు, పిల్లల పట్ల మమకారం మనలో కూడ కన్పిస్తాయి. ఇవికాక మన అహంకారం మన స్వార్థ చింతనను మరింత ఎక్కువ చేస్తుంది. ఇతరులను అదుపు చేయటానికి కావలసిన వ్యూహాలను, కుచ్చితపు ఆలోచనలను సమస్యా పరిష్కార నైపుణ్యంగా పెంచుకొంటాం. ఇట్టి వ్యక్తిత్వ లక్షణాలు కలవారు రాక్షస ప్రవృత్తితో వ్యవహరిస్తున్నట్లు కన్పిస్తారు. రాక్షస ప్రవృత్తిని మెదడులో వెనుక భాగం ప్రేరేపిస్తుంది.

అట్లాగే బాధ్యతలను తెలియజెప్పే ఆలోచనలు మెదడు ముందుభాగంలో కేంద్రీకృతమౌతాయి. సాంఘిక జీవనానికి అవసరమైన కట్టుబాట్లను విద్యుక్త ధర్మాలను సామరస్యంతో మెలిగే నైపుణ్యాన్ని మెదడులోని ముందుభాగం కలిగి వుంటుంది. మెదడులో వివిధ ప్రాంతాలలో వున్న కణాలు పై ఉదహరించిన ప్రవృత్తుల మౌలిక లక్షణాలను కలిగి వుంటాయి. ఆ లక్షణాలను కార్యవిధానాలుగా రూపొందించటానికి మనస్సు తోడ్పడుతుంది. అందువల్ల ప్రతి ఒక్కరి కార్య విధానం వారి సమస్యా పరిష్కార శక్తిపై ఆధారపడి వుంటుంది. మనస్సు మంచిది కాదు; చెడ్డది కాదు. కాని మనస్సును ఉపయోగించుకొనే తీరును బట్టి మంచి ప్రవర్తన, చెడు ప్రవర్తన బహిర్గత మవుతుంది. పుట్టుకతో అందరికి అవసరమైన వనరుల వినియోగంలో వ్యక్తుల మధ్య తేడా కన్పిస్తుంది. వారు, తరచు చేపట్టే వ్యూహాలను బట్టి వారి మనస్సు వ్యవహరిస్తుంది. అన్ని వనరులను సంపూర్ణంగాను సమగ్రంగాను ఉపయోగించుకొనే నేర్పుకలవారు పెద్ద మనుష్యులు లాగా ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో వ్యవహరిస్తారు. వారు తామానందిస్తూ ఇతరులను సంతోషపెట్టటానికి కృషి చేస్తారు. ఏదో ఒక ప్రవృత్తిని అధికంగా ప్రోత్సహించి ఇతర ప్రవృత్తులను వుపయోగించుకోని వారు ఏకపక్షంగా వ్యవహరించే అలవాటు కలిగి వుంటారు. అట్టివారు సమస్యలను సంప్రదింపుల ద్వార, చర్చల ద్వార పరిష్కరించుకొనే ఓర్పు, నేర్పు కలిగి వుండరు. తత్ఫలితంగా తరచు పోట్లాటల ద్వార తమ లక్ష్యాలను సాధించటానికి ప్రయత్నిస్తారు. వారు ఎప్పుడు తమ లోపాలను కప్పిపుచ్చుకోవటానికి ఇతర్లను నిందిస్తూ వుంటారు. తమ ప్రవర్తనలను సమర్థించుకోవటానికి ఇతర్ల లోపాలను కనిపెట్టే నేర్పును కలిగి వుంటారు. ఇతరుల లోపాలను సూక్ష్మదర్శినితో వెదికి పెట్టుకోగలిగిన వారు తమ తప్పులను పరిగణనలోకి తీసుకోలేరు. తత్ఫలితంగా చేసిన తప్పునే మళ్ళీ, మళ్ళీ చేస్తూ పరాజయ పరంపరలను ఎదుర్కొంటారు. తమ వైఫల్యాలకు ఇతరులు, సమాజం, సంస్థలు బంధుమిత్రులు కారణమని ఎత్తి చూపుతూ తమ ప్రవర్తనలో మార్పుకు ప్రయత్నించరు. అట్టి వారు ప్రతి విషయానికి అతిగా చలిస్తూ మానసిక సంక్షోభానికి లోనవుతూ వుంటారు. దీర్ఘకాలిక మానసిక వత్తిడులు, శరీర రుగ్మతలుగా స్థిరపడిపోతాయి. ఇతర్లను అదుపు చెయ్యాలని, ఇతర్లను తమ స్వప్రయోజనానికి వాడుకోవాలని, కుచ్చిత బుద్ధితో వ్యవహరించే వారు తరచూ అనారోగ్యానికి గురౌతారు. అకాల మృత్యువును తెచ్చిపెట్టుకొంటారు. ఇట్టి ప్రమాదాన్ని నివారించటానికి మనస్సు పనితీరును క్రమబద్ధం చేసుకోవాలి. ఇట్టి కృషిలో భాగంగా తమ లోపాలను కనిపెట్టే నేర్పును సంతరించుకోవాలి. ముఖ్యంగా ఇతరుల కళ్ళతో తమను తాము చూచుకోగలిగితే తమ లోపాలు తమకే స్పష్టంగా కన్పిస్తాయి. అట్టి లోపాలవల్ల తమకు, ఇతర్లకు కలిగే కష్టనష్టాలను అంచనా వేయకలిగే సామర్థ్యం వృద్ధి చెందుతుంది. ప్రవర్తనలో ఎట్టి మార్పువస్తే సమాజంలో సుఖ సంతోషాలతో జీవించవచ్చో తెలుసుకోగలుగుతారు. అప్పుడు తమ లోపాలను క్రమక్రమంగా తగ్గించుకోవటానికి అవసరమైన వ్యూహాలను దీక్షతో నియమ బద్ధంగా అమలు జరిపితే చెడు అలవాట్లు తొలిగిపోయి మంచి అలవాట్లు ఏర్పడతాయి. అప్పుడు విజయావకాశాలు మెరుగవుతాయి. మానసిక, శారీరక ఆరోగ్యం వృద్ధి చెందుతుంది. తాము సంతోషిస్తూ ఇతర్లను సంతోషపెట్టే అవకాశాలు ఎక్కువవుతాయి. ఇట్లా నియమబద్ధంగా మనస్సు పనితీరును అజమాయిషి చేయకలిగిన నాడు, లక్ష్యాలను తేలికగా అందుకోవచ్చు. తామానందిస్తూ ఇతర్లను సంతోషపెట్టవచ్చును. ఇది ప్రతి ఒక్కరికి సాధ్యం. ప్రయత్నించండి. తప్పక సత్ఫలితాలను చవిచూడగలరు.

---

# భర్త రమ్మంటే భార్య కాదనవచ్చా?

"శ్రీనందు"

లైంగిక వేధింపుల గురించి స్త్రీ ఉద్యమకారులు (ఫెమినిస్టులు) ఎంత గోల చేస్తున్నా యింతవరకూ అది అరణ్య రోదనమే అయింది గాని ఎవరూ వినిపించుకోలేదు. పురుష ప్రపంచం మదించిన తోడేళ్ళలా వీధిలో యీల వేసుకుంటూ తిరుగుతుంటే - ఆడవారు పనిచేసే చోటులలో తలవంపులు కలిగించే తీవ్రమైన రీతులలో మగవారు అభ్యంతరకరమైన చేష్టలు చేస్తూవుంటే, అవన్నీ తేలిగ్గా కొట్టి పారేస్తూ వచ్చారు ఫరవాలేదు అన్నట్లు న్యాయం చేకూర్చవలసిన పెద్దలు. ఇదంతా ఆడవాళ్ళ గోలలే అని వారి అభిప్రాయం.

ఇంకానా ఇకపై సాగదు అన్నట్లు అమెరికా సంయుక్త రాష్ట్రాల సెనెటు, లక్షలాది అమెరికన్లు టివి సెట్లను అంటి పెట్టుకుని జడ్జి క్లారెన్స్ థామన్‌పై వచ్చిన సెక్సువల్ వేధింపు అభియోగాన్ని విపులంగా గమనించారు. జడ్జి క్లారెన్స్ థామన్‌ను సుప్రీం కోర్టు జస్టిస్‌గా నిశ్చయించేశారు కూడా. అమెరికా అధ్యక్షుని చేత ఉన్నత పదవికి నియోగింపబడిన జడ్జి థామన్‌పై ఆయన పూర్వ సహచరి న్యాయ శాస్త్రంలో ఆచార్య పదవిని అధిష్టించిన ఆమె తెచ్చిన లైంగిక వేధింపు గురించిన అభియోగాన్ని పక్కకు నెట్టివేశారు. ఈ కేసు భోగట్టా పత్రికల వారికి తెలిసిన తరువాత ప్రజలు గోల చేయగా కమిటీవారు సిగ్గు లేకుండా కేసును పునః పరిశీలనకు తీసుకున్నారు.

ఫెమినిస్టులు (స్త్రీల ఉద్యమకారులు) మాత్రమే గాక అమెరికాలోని యావత్తు ప్రజానీకం లైంగిక వేధింపు నవ్వులాటల వ్యవహారం కాదని పట్టు బట్టడంతో అమెరికన్ సెనెటు రాజకీయ కారణాల వలన మెజారిటీ జడ్జినే సమర్థించవలసి వచ్చినా - ప్రజాభిప్రాయానికి తలవంచక తప్పలేదు.

ఒక ఇంగ్లీషు హైకోర్టు జడ్జి ఇటువంటి ఒక అపనింద కేసులో జ్యూరీని ఉద్దేశించి యిలా చెప్పాడు - థామన్ కేసు హియరింగు ప్రభావం చేత, లైంగిక విభేదాల వలన మానవ సంబంధాలలో నలుగురు పనిచేసే చోట వస్తున్న గొడవలు అధిక ప్రాముఖ్యాన్ని సంతరించు కోవడమే గాక, అతి సున్నితమైనవిగా రూపొందాయి.

దేశంలో అత్యున్నతమైన న్యాయ వ్యవస్థ ప్రభువుల సభ. లైంగిక వేధింపులో పరాకాష్ట అనదగిన రేపు విషయమై రూలింగు యిచ్చి దానికి గల అధిక ప్రాముఖ్యాన్ని గుర్తించింది. ప్రభువుల సభ ఎదుట వున్న ప్రశ్న ఏమిటంటే - భర్త భార్యను రేపు చేస్తే చట్ట ప్రకారం నేరస్థుడవుతాడా (క్రిమినల్లీ) అంటే ఉభయులూ చట్ట ప్రకారం విడిపోయినప్పుడు. వారి సమాధానం అవుననే మారు మ్రోగింది.

ఇంగ్లీషు లా పార్లమెంటు ఆమోదించిన స్టాట్యూట్సు ప్రకారం వుంటుంది. అలాగే యింతకు ముందు అటువంటి కేసులలో యిచ్చిన ప్రెసిడెంట్ల మీద (ముందటి తీర్పు)

ఆధారపడి వుంటుంది. దీనినే కామన్ లా అంటారు. సాధారణంగా కోర్టు అంతకు ముందు యిటువంటి కేసులో అదే స్థాయి కోర్టు యిచ్చిన తీర్పును ఫాలో అవుతుంది. అంతకంటె పెద్ద కోర్టులో యీ క్రింది కోర్టు చేసిన నిర్ణయాన్ని లేదా తీర్పును కొట్టివేయవచ్చు (అంటే అధిగమించవచ్చు). అప్పుడది శిరోధార్యమైన ప్రిసిడెంటు అవుతుంది. ఎంతవరకు? మరొక పెద్ద కోర్టు ఆ తీర్పును కొట్టివేయనంతవరకు. కొన్ని సందర్భాలలో చాలా పెద్ద న్యాయపర మైన హోదా గల వ్యక్తి యిచ్చిన అభిప్రాయం కూడా ప్రిసిడెంటుగా చెలామణీ అవుతుంది.

సర్ మాథ్యు హేల్ అనే జ్యూరిస్టు 1736లో సరిగా ఒక నిర్ణయం చేశాడు - పెళ్ళయిన వారి మధ్య రేపు అనే వ్యవహారం గురించి, అది గత 250 సంవత్సరాల నుంచి అమలులో వుంది. ఆయన చట్టపరమైన గ్రంథంలో యిలా రాశాడు (1736). భర్త భార్యను రేపు చేస్తే చట్ట ప్రకారం అది రేపు చేసినట్లు కాదు, ఎందుచేతనంటే ఉభయుల వైవాహిక దాంపత్య నిబంధన ప్రకారం అందుకు భార్య సమ్మతి వున్నట్లే లెక్క. మనసా వచా కర్మణీ ఆమె తన్ను తాను తాను అర్పించుకున్న తరువాత ఆమె ఆ అభీష్టాన్ని వెనక్కు తీసుకోలేదు.

1991 అక్టోబరు 23వ తేదీన ప్రభువుల సభ యిచ్చిన రూలింగు ఏమంటే - అది విడిపోయిన దంపతులకు సంబంధించినది. అయితే వారు చట్ట ప్రకారం వేరు కాలేదు (యిది రేపు జరగడానికి అవకాశం కలిగించింది). ఉభయులూ విడాకులు తీసుకోవాలనుకుంటు న్నారు గాని యింకా అందు నిమిత్తం ఎటువంటి ప్రయత్నాలు చేయలేదు. అలా విడిపోయిన కొన్నాళ్ళకు భర్త అత్త వారింటికి జబర్దస్తీగా వెళ్ళి (అక్కడ ఆమె వుంటున్నది) అక్కడ ఆవిడ అభీష్టానికి వ్యతిరేకంగా లైంగిక సంపర్కం పెట్టుకోడానికి ప్రయత్నించాడు.

భర్త యీ విషయాలేవీ కాదనలేదు కోర్టులో అతనిమీద రేపు చార్జీ పెట్టి కేసు వేసినపుడు - పైపెచ్చు కామన్ లా ప్రకారం తను నేరస్థుడు కాడని వాదించాడు. అసలది నేరం క్రిందకు రాదని అతని వాదన. ఏమైనా క్రింది కోర్టులో అతను నేరస్థుడే అని నిర్ణయించారు. అతను రెండవసారి ప్రభువుల సభకు అప్పీలు చేసుకున్నాడు.

ఐదుగురు సభ్యులు (లార్డ్సు) గల ప్రభువుల సభ ఏకగ్రీవంగా భార్యకు వద్దని తిరస్కరించే హక్కు వుందని చెప్పారు. లార్డు కైత్ ముఖ్యమైన తీర్పు భాగాన్ని వినిపిస్తూ - సర్ మాథ్యూ హేల్ 1736లో యిచ్చిన తీర్పు కాలదోషం పట్టిందని చెల్లదని అన్నారు. పైగా అది ఉపద్రవకరంగా వుంది యిప్పుడు అని కూడా సెలవిచ్చారు. ఆ కాలంనాటి పరిస్థితుల్ని అది ప్రతిబింబించింది అన్నారు. ఆనాటి నుంచి వివాహిత యువతుల స్థితిగతులు ఊహించరా నంతగా, గుర్తించలేనంతగా యిప్పుడు మారిపోయాయి అని చెప్పారు.

ఇంకా లార్డ్ కైత్ యిలా స్పష్టం చేశారు - యీ నిర్ణయం ద్వారా తాము కొత్త నేరాన్ని సృష్టించడం లేదు - యింతకు ముందు వున్న కామన్ లా సృష్టించిన కాల్పనిక సన్నివేశాన్ని తీసివేశాము, తొలగించాము అంతే. ఈనాటి దాంపత్యం అనేది. వివాహంలో సమానుల మధ్య బంధం - అంతేగాని భార్య భర్త కన్న తక్కువ, లోబడి వుండాలని ఏమీకాదు అన్నారు.

ఈ చరిత్రాత్మకమైన తీర్పు చదవగానే కోర్టులో వున్న మిలిటెంటు వనితలు చప్పట్లు చరిచి కేకలు పెట్టి నానా గొడవ చేస్తే వారినందరినీ కోర్టు ఆవరణ నుంచి మర్యాదగా బయటికి పంపబడ్డారు

(గత సంచిక తరువాయి)

# ప్రపంచంలో ఉత్తమోత్తమమైన విద్యాబోధన

సేకరణ:
సుజాత
సూరపనేని
USA

## జపాన్

అంతర్జాతీయ పరీక్షలలో జాపనీస్ విద్యార్థులు సైన్స్ విద్యలో అగ్రగాములు. అది జపాన్‌కి సంతోష కారణం. లాయర్లకంటె ఇంజనీర్లు ఎక్కువమంది అక్కడ తయారవుతున్నారు. అమెరికన్ అయిడియాలను జపాన్ సంగ్రహించి తన సొంత అయిడియాలను రూపొందిస్తూ వుంటుంది. అమెరికన్ పండితులు రాసిన మంచి మంచి వ్యాసాలలోని ఉద్దేశాలను సంగ్రహించి జపాన్ గొప్పగా వ్యాపారం చేసి లాభాల మీద లాభాలు ఆర్జిస్తోంది. అమెరికన్‌లు నోబెల్ బహుమతులు పొందడంతో సంతృప్తి పడుతున్నారు. 1968-77 మధ్య కాలంలో జపాన్ విద్యావిధానాన్ని మార్చుకుంది. పాఠ్య ప్రణాళికలను సైన్స్ విద్య నుండి, పనికి వచ్చే (ఉపయోగపడే) సైన్స్ విద్యకు తరలించింది. ప్రశ్నించే విద్యార్థుల్ని తయారుచేయాలని పట్టుబట్టింది. పూర్వంలా విధేయులుగా వుండే వారికంటె సృజనాత్మకంగా ఆలోచించే వారు ఎక్కువ మంది వుండాలి అన్నది ధ్యేయం. స్వతంత్రమైన ఆలోచనల మీద పనిచేసే వారు కావాలి. మనిషిని సృష్టించాక ఆ మనిషి మళ్ళీ సృష్టింపగలిగేలా వుండాలి. బల్లమీద ప్రయోగాలు చేయడం ద్వారా విద్యార్థులు విజ్ఞానాన్ని ఆర్జిస్తారు (పుస్తకాలు చదివి రుబ్బడం వలన కాదు). పాఠాలు ప్రయోగాత్మకాలు గనక జ్ఞాపకం వుంటాయి విధిగా. విచారించడం, తెలుసుకోవడం అనేవి శాస్త్రీయమైన పద్ధతులు. పిల్లలచేత వస్తువులను తూకం వేయించి తూకాలు నోట్ చేసుకున్నాక వాటి బరువుల్ని సమీక్షిస్తారు. పెనిసిళ్ళు, అద్దాలు, రకరకాల వస్తువుల తూనికలు కొలతలు పరిశీలించడం నేర్పుతారు. టెక్స్టు పుస్తకాలు దూరం నుంచి క్లాసులో వినడం అనే పద్ధతికి స్వస్తి చెప్పారు. పాఠం వేళ్ళ చివరల్నుంచి బుర్రలోకి ఎక్కుతుంది గాని నోట్సులు వ్రాయడం, బట్టీ పట్టడం వలన కాదు. శాస్త్రీయమైన విజ్ఞానం మీద ఆధారపడిన సాంకేతిక పరిజ్ఞానం కూడా పిల్లలకు నేర్పుతారు. ఇంటి వద్దనుంచి చిన్న చిన్న పరికరాలను తెచ్చి స్కూల్లో రిపేరు చేస్తారు-బ్రెడ్ టోస్టర్ వంటివి. సైన్స్‌లో యిమిడిఉన్న సూత్రాలు తెలుసుకునే ముందుగానే సాంకేతికంగా వాటి ఉపయోగాలను తెలుసుకుని వుంటారు. నాల్గో తరగతి విద్యార్థులు చిన్న చిన్న గృహోపకరణాలను బాగుచేయకలిగే స్థాయిలో వుంటారు. పది సంవత్సరాల పిల్లలు సోలార్ బ్యాటరీలను తీసుకుని మోడల్ కార్ల మీద పనిచేయడం తెలుసుకుని వుంటారు. సూర్యరశ్మి శక్తితో పనిచేసే ఆట వస్తువులను చేయడం నేర్చుకుంటారు. దృశ్య సంబంధమైన భౌతిక సూత్రాలను పోటో వోల్టయిల్స్

విధానాలను ఎంతో ఆసక్తికరమైనవి క్రీడల ద్వారా కూడా గ్రహిస్తారు. పుస్తకాలను గ్రోలడం తప్పించి మైక్రోస్కోపు చేతపుచ్చుకోవడం విద్యార్థులకు నేర్పుతారు. అమెరికాలో యిటువంటి పద్ధతులకు పరిశ్రమకు సానుభూతి లేదు. జపాన్ ప్రభుత్వం విద్యాశాఖ అన్నీ నిర్దేశిస్తుంది. విద్యార్థి పాఠ్య ప్రణాళిక నుంచి, గణితంలో కంఠతా పట్టవలసినవి, చరిత్ర భాగంలో జ్ఞాపకం చేసుకోవలసినవి విధిగా యివి కోర్సుల్లో వుండాలని పట్టుపడతారు. టెక్నాలజీ ముందు, సైన్స్ తరవాత - మచ్చుకి అమ్ల (జనిత) వర్షాల గురించి చెప్పవలసి వస్తే అటువంటి వర్షాలు వాటి ప్రభావం గురించి ముందు చెప్పి తరవాత ఆమ్లము దాని లక్షణాలు వివరిస్తారు. సైన్స్ ఎందుకు చదవాలి అనే, మౌలిక కారణాలు తరవాత చెబుతారు. ప్రస్తుతానికి వాటిని దాచిపెట్టి మిగతావి ఉపయోగించి వల్లెవేయిస్తారు. నిత్య జీవితానికి సంబంధించిన అంశాలను జ్ఞాపకం పెట్టుకుంటారు ప్రముఖంగా. జపాన్ యీ ఊహలకు ప్రాణం పోసే చదువుల్ని చెప్పిస్తుంది.

## డచ్‌వారి బోధనా పద్ధతులు

కోర్టు కేసులో 'క్లేరెన్స్ థామస్ హియరింగులు' గురించి యువతీ యువకులైన విద్యార్థులు జట్లు జట్లుగా ఏర్పడి చర్చించు కుంటున్నారు. తెల్లవారి మధ్య ఇలా జరగదు. ఇది స్వంత విషయం. అతను తనని తాను సమర్థించుకోనవసరం లేదు. సెక్సు వేధింపు చాలా ఘోరమైన సంగతి. స్త్రీ పురుషుల మధ్య పనిచేసే చోట్ల వుండవలసిన సత్సంబంధాలను యిది పాడుచేస్తుంది. ఎందుకు? తరగతి గదుల్లో కూడా... సెక్సు వేధింపు వుండనే వుంది. ఇలాటి రాతలు క్లాసు గదుల్లో కనిపించగా వివిధ అంశాలను గురించి బాహాటంగా విద్యార్థులు చర్చించుకున్నారు.

అమెరికన్ సివిక్స్ క్లాసు మూడు వేల మైళ్ళ దూరంలో జరుగుతోంది. డచ్ విద్యార్థులు, వీరంతా యింగ్లీషులో మాట్లాడుకుంటున్నారు. ఎవరూ ఒక్కరు కూడా బ్రిటన్ దర్శించ లేదు. అమెరికా అసలే వెళ్ళలేదు. వారి ఉచ్చారణ మాత్రం దోషరహితమైన ఇంగ్లీషు. అమెరికన్ పిల్లల కంటె డచ్ పిల్లలు భాషలు నేర్వడంలో ప్రవీణులు. ఆమ్‌స్టర్‌డం దగ్గర ఆల్‌మీర్ అనేచోట 12 - 18 సంవత్సరాల పిల్లల మధ్య యీ సంభాషణ నిర్దిష్టమైన భాషలో జరిగింది. పిల్లలు ప్రత్యేకంగా పెరిగిన ధనవంతుల బిడ్డలు కారు. అంతా పేద కుటుంబాలనించి వచ్చిన వారే. గవర్నమెంటు గ్రాంటులు తీసుకుని ఆల్‌మీర్ స్కూల్లో చేరిన వారు. హాలండ్ లో విదేశీ భాషలు నేర్వడం అనేది ఉన్నత విద్యలు నేర్చేవారి కోసం ప్రత్యేకించబడుతుంది.

ఫ్రెంచి లోంచి డచ్‌లోకి డచ్‌నుండి ఫ్రెంచిలోకి అనువదించడం నేర్పేవారు 20 ఏళ్ళ క్రితం విదేశీ భాషల శాఖలో. నెదర్లాండ్స్ చాలా చిన్న దేశం. ప్రపంచంలో - డచ్ భాష తక్కువగా మాట్లాడతారు. దేశ ప్రజల అవసరాలకు అనుగుణంగా విదేశీ భాషలు నేర్పవలసిన అవసరం గుర్తించి నెదర్‌లాండ్స్ అందుకు ప్రణాళికా బద్ధంగా కృషిచేసింది. యూనివర్సిటీల దిగువ స్థాయిలో ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మను భాషలు బోధిస్తారు. పిల్లలంతా ఇంగ్లీషు విధిగా తీసుకుంటారు. 8 సంవత్సరాలపాటు పెద్ద చదువుల్లో విద్యార్థులు మూడు భాషలూ నేరుస్తారు. తరగతుల్లో కొత్త భాషను నేర్వడం కోసం అనేక రకాలుగా ప్రసంగాల్లో

ఉపయోగిస్తారు. సాధారణ పరిస్థితుల్లో మామూలు మాటలు వాడటం కూడా నేర్పుతారు. ఉత్తరాలు వాస్తవంగా రాయిస్తారు. డచ్ విద్యార్థులు విదేశీ భాషలను నిర్దుష్టంగా నేర్చుకుంటారు. పెద్దయాక వారు అన్యభాషలలో పరిశ్రమించాలి. అమెరికాలో మరో భాష నేర్వడం అధికం అనుకుంటారు. నెదర్‌లాండ్స్ వారికది విధాయకం. కాలేజీ చదువులలో తప్ప అరబిక్, రష్యన్ భాషలు నేర్చుకునే అవకాశం లేదు. ఇంగ్లీషు మిగతా మూడు భాషల మీద ఆధారపడతారు.

## పిట్స్‌బర్గ్ (అమెరికా)

స్టూడెంట్స్ ఒకరికొకరు చదువులు చెప్పుకునే (టీచ్) పద్ధతిని కొత్త కల్పనలు చేసే ప్రొపెల్ (PROPEL) అనే సంస్థ ప్రారంభించింది. ఉత్పాదన, జ్ఞానం, ఆలోచన-యివి మూడు అంచెలు జ్ఞానాభ్యాసంలో. హోవర్డ్ గార్డెనర్ అనే హార్వర్డ్ విశ్వ విద్యాలయం మనస్తత్వశాస్త్ర ఆచార్యుడు 1983లో ''ఫ్రేమ్స్ ఆఫ్ మైండ్'' అని ఓ పుస్తకం రాశాడు. నైపుణ్యం లేదా నేర్పు అనేవి బుద్ధికి భిన్నమైన ఆకారాలు, అవి తరగతి గదులలో తర్ఫీను యిచ్చి నేర్పిస్తే చక్కగా వికసిస్తాయి. మిగతా రోజువారీ చదువుల సబ్జెక్ట్సులో యివి కూడా నేర్పవచ్చు. తన సిద్ధాంతాలని ఆచరణలో పెట్టి పరీక్షించడానికి పిట్సు బర్గ్‌లోని స్కూళ్ళ సూపరింటెండెంట్ రిచర్ట్‌వాలిస్ అవకాశం కల్పించాడు. కళ కళకోసమే కాదు కళ బుద్ధి వికసనం కోసం (మైండు కోసం). కళలనేవి విలాసవంతమైన విషయాలని పలువురు అనుకుంటారు. వాటిని అవసరమైనవిగా మార్చడం యీ విద్యా విధానంలోని ప్రత్యేకత. సంగీతం, దృశ్యకళ, సృజనాత్మక రచన అనేవి పిట్సుబర్గ్ మాధ్యమిక సెకండరీ పాఠశాలలో పాఠ్య ప్రణాళికలోని అంశాలు. కళాత్మకంగా వ్యక్తం చేయటం ఎలాగో విద్యార్థులు నేర్చుకుంటారు. సమస్యలను పరిష్కరించే క్రమాన్ని అలవర్చుకుంటారు. అలా పరిష్కరించడమే గాక వారి కృషిని అభివృద్ధి చేసుకుంటారు. దీనినే విద్యావేత్తలు విమర్శనాత్మకమైన ఆలోచనా విధానం అంటున్నారు. అధ్యాపకులు కూడా విద్యార్థులతో సమంగా యిందులో నేర్చుకుంటారు. టీచర్లు వారికి సమస్యను యిచ్చే ముందే తాము పరీక్షించి ప్రయోగించి చూసుకుంటారు. టీచర్లు మాట్లాడుతూ వుంటే వారు వారి పనులు చకచక చేసుకుపోతారు.

ఈ పద్ధతిలో అధ్యాపకులకు శిక్షణ నివ్వడమనేది ప్రముఖ విషయం. స్కూలు సంవత్సరం పూర్తి కావడంతో టీచర్ల శిక్షణ పూర్తవుతుంది. విద్యార్థులు వారి అభివృద్ధిని పరిశీలించడానికి ప్రతిభకల వారిని ఆ తలిదండ్రులలో ఎవరో ఒకర్ని గాని, మగ స్నేహితుడ్ని స్నేహితురాలిని గాని ఎవరినైనా తెచ్చుకోవచ్చును. టీచర్లు పిల్లల అభివృద్ధిని కొలిచి సమీక్షించరు. మొట్ట మొదటి కాగితపు పని దగ్గర్నుంచి తయారయే వస్తువుల కొరకు పర్యవేక్షించడానికి ఒక ప్రత్యేక శాఖ వుంటుంది. తల్లిదండ్రులకి వారి సంతానం యిక్కడ ఏమి చేస్తున్నారో తెలుసు. రచనా తరగతులకు ప్రొపెల్ ప్రాణం పోసింది. కుటుంబ కథలను వ్రాయమని ఒకసారి అడిగారు. గ్రామరు పాఠాలు బోధించడం ద్వారా ఎంత శిక్షణ కలగచేస్తున్నారో అంత శిక్షణా రచనల క్లాసుల ద్వారా కలిగించవచ్చును. మాటలతో బొమ్మల్ని చిత్రించడం నేర్చుకుంటున్నాము అన్నారు. ఒక రచనల క్లాసులో మీ బంధువులలో ఎవరైనా వింత వ్యక్తులుంటే చెప్పండి అని అడిగితే ఒకతను ఇంగ్లండు నుంచి 1889లో వలస వచ్చిన తన ముత్తాత

గురించి చెప్పాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో పోరాడిన తన తాతగారి గురించి ఒక బాలిక చెప్పింది. మొత్తంమీద అంతా అభిప్రాయాలను పంచుకున్నారు.

## జర్మన్ హైస్కూళ్లు

బలహీనుల కోసం చవటల కోసం గాదు జర్మనీలో హైస్కూళ్ళు. 18 సంవత్సరాల పిల్లలు జర్మన్, అర్థశాస్త్రాలు, రాజకీయశాస్త్రాలు, వాణిజ్యపరమైన రాతలు కోతలు, వ్యాపార సంబంధమైన అంశాలు బోధిస్తారు. ఇవన్నీ బుధ, గురువారాలలో వుంటాయి. సోమ, మంగళ, శుక్రవారాలు అప్రెంటిస్ సివిల్ ఇంజనీర్లుగా ఒక చిన్న సంస్థలో పనిచేస్తారు. అంటే బ్లూప్రింటులు తీయడం, కాలువలు సర్వే చేయడం యిలాంటి పనులు చేసినందుకు నెలకు 1,100 మార్కులు (690 డాలర్లు) సంపాదిస్తారు. అంతా సవ్యంగా జరిగితే ఇంజనీరింగు ఉద్యోగానికి ఆ వ్యక్తి గ్రాడ్యుయేటు అవుతారు. వృత్తి విద్యలపట్ల జర్మనులకు గల గాఢానురక్తి వారి విద్యాప్రణాళికలో వెల్లడవుతుంది. హైస్కూలు దశలోనే యివన్నీ ఉటంకించడం ప్రపంచంలోకెల్ల జర్మనీ చదువుల ప్రత్యేకత. కాలేజికి వెళ్ళేముందు ప్రారంభ దశలో ఒక స్కూలు వుంటుంది. దాన్ని జింనాషియమ్ అంటారు. ఈ స్కూలుదశ గడిచాక వివిధ వృత్తులలో ప్రావీణ్యం కోసం వృత్తి విద్యాలయాలకు శిక్షణకై వెళ్తారు. కొంతమంది పై చదువులకు వెళ్తారు. మూడు మార్గాల ప్రజలు మళ్ళుతారన్నాము కదా - మధ్య యుగాల నాటి జర్మనీలో రైతువర్గం, వాణిజ్యవర్గం, నోబుల్ వర్గం వుండే వారు. యూనివర్సిటీకి తక్కువ స్థాయికి చెందిన స్కూళ్ళలో సైతం చాలా సుశిక్షితంగా అన్ని విద్యలూ అమెరికాలో కంటె క్షుణ్ణంగా నేర్పుతారు. 19 సంవత్సరాలు వచ్చేసరికి జర్మన్ విద్యార్థి విద్యాపరంగానూ వృత్తిపరంగానూ ఎక్కువ సామర్థ్యం గడిస్తాడు.

తల్లితండ్రులు ఐదవ తరగతి స్థాయిలో తమ పిల్లలను చేరుస్తారు. వారు సబ్జక్టులను మార్చుకోవచ్చును. పదవ తరగతి తర్వాత విషయాలను బట్టి వారు విడిపోతారు. జిమ్నాషియం విద్యార్థులు విశ్వవిద్యాలయాల ప్రవేశ పరీక్షలకు తయారవుతారు. (అబితర్ అంటారు). తతిమ్మ వారు సాంకేతిక విద్యలలో వృత్తి విద్యలలో శిక్షణకు అప్రెంటిస్‌లుగా వెళ్తారు. అప్రెంటిస్‌గా చేరే వ్యక్తి ఒక పరిశ్రమలో గాని వ్యాపార సంస్థలో కాని కొంత జీతం మీద తనకు శిక్షణనిచ్చే భాగస్వామితో మూడు సంవత్సరాలు కలిసి పనిచేస్తాడు. వీరు చేస్తున్న కృషిని ఒక మాస్టర్ ట్రేడ్స్‌మన్ (పెద్ద వృత్తివిద్యా నిపుణుడు) పరిశీలిస్తాడు. ప్రతి కంట్రాక్టు ఒక సూపర్‌వైజింగ్ అధికారం కల సంస్థతో రిజిస్టరయి వుంటుంది. పారిశ్రామిక వృత్తులకు సంబంధించిన వారు అందునిమిత్తమై వున్న చాంబర్ ఆఫ్ కామర్స్ వారితో నమోదు చేయించుకుంటారు. నర్సింగ్ శిక్షణకు ప్రభుత్వ ఆరోగ్యశాఖతో చేయిస్తారు. పట్టభద్రుల స్థాయిలో ఉత్తీర్ణులు కావడానికి యివ్వవలసిన మార్కుల్ని వీరు నిర్ణయిస్తారు. వాణిజ్య రంగంలోని వారు తమ తరువాత తరాన్ని తయారుచేయవలసిన బాధ్యత తమ మీద వుంది అని భావిస్తారు. లేబర్ పూల్‌లను ఏర్పాటుచేస్తారు.

పెద్ద పెద్ద సంస్థలు తమ ఆవరణలోనే విద్యాపరమైన వృత్తిపరమైన తరగతులను నిర్వహిస్తాయి. చాలామంది అప్రెంటిసులు వారి తరగతులలో చేసే కృషి వృత్తి విద్యా స్కూళ్ళలోనే పూర్తిచేస్తారు. రెస్టారెంటు నిర్వహణం దగ్గర్నుంచి మెటల్ పనివరకు తొమ్మిది

విషయాలలో జి.బి.ఏ. బోన్ డిగ్రీలను యిస్తుంది. సుమారు 3500 మంది విద్యార్థులు తరగతి గదుల్లో వారానికి 10, 12 గంటలు వుంటారు. నాలుగు కోర్సులు తప్పనిసరివి, ఎనిమిది ఉద్యోగాలకు సంబంధించిన విషయాలు బోధిస్తారు. స్కూళ్ళలో సిద్ధాంతానికి సిద్ధాంతం ప్రత్యక్ష శిక్షణ రెండూ కలగచేస్తారు. ఒక నిపుణుడైన పనివాడు సంక్లిష్టమైన పద్ధతులనన్నిటినీ ఉత్పాదనాక్రమంలో విడమర్చి చెప్పగలిగి వుండాలి. ప్రతి యువతి, యువకుడు ఒక ప్లాను వేసుకుని దానిని సమర్థంగా నిర్వహించగలగాలి. దానిని అదుపులో వుంచుకొనగల ప్రావీణ్యం వుండాలి. దాని విలువ కట్టకలిగిన వాడై వుండాలి. కొంతమంది సాంకేతిక శిక్షణనిచ్చే సంస్థలకు తరలివెళ్తారు. పట్టభద్రులయ్యాక మరికొందరు ఉద్యోగాలలో చేరుతారు. ఎక్కడ శిక్షణ పొందాలో అక్కడే చేరుతారు. ఇప్పుడు తూర్పు జర్మనీ విద్యార్థులను 10 శాతం మటుకే యీ కోర్సులలో చేర్చుకుంటున్నారు. కాలేజి విద్యకు ముందు చెప్పే కోర్సులు చాలా గట్టిగా మంచి అకడమిక్ ప్రమాణాలను కోరుతూ వుంటాయి.

## జర్మనీలో ఉపాధ్యాయవర్గం

జర్మనీలో అధ్యాపకులకు మంచి జీతాలు యిస్తారు. ఒక మధ్య తరగతి కుటుంబం సుఖంగా జీవించడానికి కావలసినంత జీతం యిస్తారు. పౌర ఉద్యోగి స్థాయికి టీచర్లు ఎదుగుతారు. సివిల్ సర్వెంటుతో సమంగా చూశాక ఉద్యోగానికి భద్రత, కొన్ని సదుపాయాలు, తక్కువ వడ్డీకి తణఖా ఋణాలు, సాంఘిక భద్రతకై చెల్లించే పన్నులనుండి విముక్తి లభిస్తాయి. చాలా ప్రతిభావంతులు, చురుకైన వారు, తెలివైన వారు అధ్యాపక వృత్తి వైపు మొగ్గుచూపుతారు. అధ్యాపకులకు కఠినమైన శిక్షణ వుంటుంది. గురువుల్ని ఎంత బాగా చదివిస్తారంటే అధ్యాపకులు చాలా విలవయిన వ్యక్తులు, వారి నుంచి జాతి ఏర్పడుతుంది. ఆ స్పృహ జర్మనులకు హెచ్చుగా వుంది. అమెరికాలో ఫక్తు దీనికి వ్యతిరేకంగా చేస్తారట. జర్మనీలో అధ్యాపకులు కాబోయే వారు రెండు విద్యావిషయకమైన విషయాలలో క్షుణ్ణంగా వుండాలి. ఇది అధ్యాపక వృత్తిసిద్ధాంతానికి సంబంధించిన విషయం. ఎక్కువ విషయాలలో 'మాస్టరీ' సంపాదించడం వలన అనేక విషయాలు అవలీలగా మార్చి మార్చి బోధించగల్గుతారు. టీచర్లని మాటి మాటికీ పరీక్షలు పెట్టి పదునులో పెడతారు. రెండు యం.ఏ. డిగ్రీలు వచ్చాక విద్యాబోధన కోర్సులకి ఒకావిడ వెళ్ళింది. రెండు సంవత్సరాల సమగ్రమైన టీచర్ శిక్షణ తరువాత సెమినార్లు నిర్వహించి తరగతి గదుల టీచింగ్ అనుభవం మినిస్ట్రీ ఆఫ్ కల్చర్ కలిగిస్తుంది. సెమినార్ తరువాత గ్రూపు డైరెక్టర్లతో పాఠ్యాంశాలపై సిద్ధాంతపరమైన ప్రత్యక్ష పాఠం చెప్పే అనుభవంపైన సమావేశాలు జరుగుతాయి. ఇది టీచర్లకి చాలా కష్టకాలం అంటారు. పాఠాలు చెప్పడానికి ముందు క్లాసులో వెనక కూర్చుని యితరులు చెప్తుంతూండగా వినాలి. తరువాత పాఠం చెప్పాలని తమకే అనిపిస్తుం. ఈ టీచర్ చెప్తుండగా నిజమైన మరో టీచర్ పాఠాలను చూస్తూ విమర్శిస్తూ సహాయం చేస్తుంది. రెండు సంవత్సరాలు యిట్లా జరిగాక సెమినార్ డైరెక్టర్ వచ్చి పర్యవేక్షించాక, ఆఖరి ప్రభుత్వ పరీక్ష వుంటుంది. ఒక విషయం పై వరుసగా కొన్ని పాఠాలు రూపొందించి చెప్పాలి. అప్పుడు టీచింగ్‌కి అనువైన యోగ్యతా పత్రాలు యిస్తారు. మళ్ళీ వీరికి ఓరల్ పరీక్ష కూడా జరుగుతుంది. ఇంత ట్రైయినింగు పొందాక ఉద్యోగం వస్తుందని గ్యారంటీ ఏమీలేదు. 16 వేలమంది యిన్ని పరీక్షలు యిన్ని ట్రైనింగులు అయిన వారు ఉద్యోగాల కోసం జర్మనీలో నిరీక్షిస్తున్నారు.

ఎక్కువమంది అమెరికా వెళ్ళి అక్కడ పాఠాలు చెప్పడానికి ఎందుకో యిష్టపడడం లేదు. అమెరికాలో పనిచేసే పరిస్థితులు పూర్; జర్మనీలో ఉద్యోగావకాశాలు పూర్.

## అమెరికా

అమెరికన్ స్కాలర్స్ అంతర్జాతీయ సైన్స్ టెస్టుల్లో ఆఖరి స్థానంలో వుంటారు. అమెరికన్ హైస్కూలు విద్యార్థులకి 'చెర్'కి 'చెర్నోబిల్'కి తేడా తెలియదు. కాని, ప్రపంచం సైన్స్, ఇంజనీరింగు విద్యలు నేర్వాలంటే (యునైటెడ్ స్టేట్స్) అమెరికా సంయుక్తరాష్ట్రాలు వెళ్ళి చదువుకోవాలనుకుంటారు. 33.8% డాక్టరేట్లు అమెరికన్ యూనివర్సిటీస్ యిచ్చేవి నేచురల్ సైన్సెస్, కంప్యూటర్ సైన్సెస్, ఇంజనీరింగు శాఖలలో అన్నీ యితర దేశాల విద్యార్థులకే వెళ్ళాయి. అమెరికా గ్రాడ్యుయేట్ సంస్థలు సైన్స్‌లో బాగా చేసేవి కాని అంతర్జాతీయ పరీక్షలలో తగ్గేవి. కారణం ఆ పరీక్షలలో ఏదో మోసం వుంది. అటువంటి స్థితి నుంచి అమెరికా ఎలా విజయం సాధించింది? రెండవ ప్రపంచ యుద్ధం తరువాత విశ్వవిద్యాలయాల్లో పరిశోధన అసమానమైన సైంటిస్టుల్ని తయారుచేసింది. నభూతో నభవిష్యతి అనేటువంటి విద్యావకాశాలు ఎలాటి చోట్ల అంటే కేలిఫోర్నియా ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ వంటివి. కాల్‌టెక్ అనేచోట 21 నోబెల్ బహుమతి గ్రహీతలు పనిచేస్తున్నారట. అక్కడ లేబరేటరీల్లో పాజిట్రానులు, క్వార్క్స్, క్వాజార్స్ వంటివి కనుగొన్నారు. సెసిమోలజీ, జియోకెమిస్ట్రీ మోలిక్యూలర్ బయాలజీ, ఆస్ట్రోఫిజిక్స్ యిన్ని కొత్త శాస్త్రాలను ప్రవేశపెట్టారు. ఇంతకంటె గొప్ప సృజనాత్మకమైన విద్యాలయాన్ని గూర్చి నేను వినలేదు అన్నాడు ఒక విద్యార్థి. మానవ మేధను పరిశీలించి పరీక్షించే అధ్యయనం కాల్‌టెక్ వద్దనే వుంది. కాల్‌టెక్ ఉన్నత విద్యకు పరాకాష్ఠ. ఇతరులు వెళ్ళని తావులకు వెళ్ళి అన్వేషణ కొనసాగిస్తున్నాము అంటారు ప్రొఫెసర్ కోల్.

## వయోజన విద్య - స్వీడన్

స్వీడన్ శీతల రాత్రులను ఎదుర్కోవడానికి స్థానికులు చదువుల కూటాలను పూర్వం ఏర్పాటు చేసుకున్నారు. ఇజిప్షియన్ కళల గురించి ప్రారంభించి విదేశ భాషలు యింగ్లీషు వరకు చర్చించుకునే వారు, 1930ల్లో సోషల్ డిమోక్రాట్స్ అధికారంలోకి రాగానే 'స్టడీ సర్కిల్స్' జాతీయ విధానంగా రూపొందాయి. 'నీ జీవిత కాలం అంతా నేర్చుకుంటూ వుంటావు' అన్నది స్వీడన్లో సూత్రం. ప్రభుత్వం 60% ఖర్చు భరిస్తుంది. సంవత్సరానికి డాలర్లు 188 మిలియన్లు అవుతుంది. స్వీడిష్ వయోజన విద్య కళలను నేర్పడమే గాక వృత్తివిద్యలకు సంబంధించి కూడా వుంటుంది. సెమినార్లు నిర్వహిస్తారు. వాణిజ్య అర్థశాస్త్రం గురించి 28 వారాలు చెబుతారు పాఠాలు. పాఠ్యాంశాలు 100 ప్రభుత్వ అధ్యయన కేంద్రాల ద్వారా దేశవ్యాప్తంగా అందిస్తారు. ఎంత పెద్ద వయసులోనయినా అధునాతన అకౌంటింగ్ కంప్యూటర్ నైపుణ్యాలు నేర్పిస్తారు. వ్యక్తులపరంగా వయోజన విద్యకై ప్రభుత్వం వ్యయపరచే సొమ్ము జాతి తరపున పెట్టుబడి నిధిలా ఉపయోగపడుతుంది. జాతీయాదాయంలో 84% నిరుద్యోగ భృతికింద పోతుంది. స్వీడన్ విరివిగా డబ్బు శిక్షణకై పౌరులకు, అమెరికాకు నాలుగు రెట్లు ఖర్చు పెడుతుంది. పౌరుల గురించి జాగ్రత్తలు తీసుకోవాలని ప్రభుత్వం గుర్తించింది. శిక్షణ కార్యక్రమాలలో వున్న జనాన్ని నిరుద్యోగులుగా ఉద్యోగాలు లేకపోయినా

పరిగణించరు. కొంతమందిని అసలైన ఉద్యోగాలకు ఎడంగా యీ విధంగా కట్టిపడేసి వుంచుతారు. 70% శాతం శిక్షితులకు ఆర్నెల్లలోగా ఉద్యోగాలు దొరుగుతాయి. ఇప్పటి స్వీడిష్ ప్రభుత్వం సోషల్ డిమోక్రాట్లను పదవీచ్యుతులను చేసింది. సాంఘిక సంక్షేమ పథకాలు కొన్నింటిని విమర్శించిన మితవాదులు ఉద్యోగుల శిక్షణపై ఖర్చుకి వెనుకాడరు. కేపిటలిస్టులు ఆరోగ్యవంతులైన యువకులను సంఘానికి ప్రయోజనకరమైన పనుల్లో పెడుతున్నందుకు సంతోషించాలి.

## ఆసియా ప్రెషర్ కుక్కర్ విద్యా విధానం

ఆసియా దేశాలలో చాలామంది పిల్లలకు విద్య అనేది మహానరక సదృశం, పిల్లల్ని కాల్చుకు తినడం కిందే లెక్క. జపాన్ వారి ప్రెషర్ కుక్కర్ విద్యా విధానం ఆసియాలోని డబ్బుగల దేశాలు అనుసరించినా యిందులో పరీక్షలకే ఎక్కువ ప్రాధాన్యం. క్లాసుల్లో రాంకుల్ని గొప్పగా తలుస్తారు. అది ఒక హోదాగా కూడా అనుకుంటారు. చదువుల్లో ఒకర్ని మించి ఒకరు పోటాపోటీలుగా చదివి ఎక్కువ మార్కులు ఎక్కువ రేంకులు సాధించడం విద్యకు లక్ష్యంగా పరమావధిగా భావిస్తున్నారు. తల్లితండ్రులు, టీచర్లు, పరిపాలకుల అభిప్రాయం కూడా యిదే. కొంతమంది నెగ్గితే మరికొంతమంది విఫలురయి భగ్న హృదయులవుతారు.

ప్రెషర్ కుక్కర్ విద్యా విధానం నైపుణ్యంగల పనివారిని ఉత్పత్తులు వర్ధిల్లేలాగ కాపాడుతూ వుంటుంది. సింగపూర్ నుంచి హాంగ్‌కాంగ్ వరకు అక్కడ్నుంచి టోకియో దాకా సాధించిన ఆర్థిక విజయపరంపర ఆ విద్యా విధానం యొక్క గొప్పతనమే. అయితే అందుకు ఎంత ఖర్చయింది అంటే మాట్లాడనక్కర్లేదు. ఎలిమెంటరీ స్కూలు విద్య హైస్కూల్ విద్య గడపడం ఒక పెద్ద గండంగా పిల్లలు భావిస్తారు. ఈ చదువులో వున్న పెద్ద లోపం అని పిల్లలను వారికి వారు ఆలోచించనివ్వదు. నష్టపోయిన బాల్యం ఖరీదు ఎవరు కట్టగలరు? తమ తరగతిలోని విద్యార్థులతో పోటీగా వుండటం కోసం జాపనీస్ విద్యార్థులు 'క్రామ్ స్కూల్స్'కి వెళ్తున్నారు. ఒక జపాను గృహిణి తన పిల్లలను స్నేహితులతో ఆడుకోనివ్వదు. ఎందుకంటే టైము వుండదట. పిల్లలందరు 'క్రామ్' స్కూళ్ళకి వెళ్తారు గనుక ఎవరికీ కలిసి ఆడుకుందుకు టైమ్ వుండదు. 1941లో మొదటి ఐదు నెలల్లో నెలకి ఒక శిశువు చొప్పున అంతా ఆత్మహత్యలు చేసుకున్నారు.

ప్రతి వారు చిలకవలె అర్థజ్ఞానం లేకుండా వల్లె వేసే పాఠ్యక్రమాలను చదువుచెప్పే పద్ధతిని దాని క్రౌర్యాన్ని దుర్మార్గాన్ని గురించి ఫిర్యాదు చేస్తారు గాని దాని విజయాన్ని చూసి మాట్లాడకుండా వూరుకుంటున్నారు-బుద్ధి చెప్పువాడు గుద్దినా మంచివాడన్నట్లు . దక్షిణ కొరియా యిందుకు భిన్నం.

దేశంలోని స్కూళ్ళన్నిటినీ ప్రభుత్వం పునః వ్యవస్థీకరించాలనుకుంటోంది-ఇప్పటి క్లాసు రూములకు దూరంగా 1995 నాటికి. పునర్నిర్మించే విద్యా విధానంలో టెస్ట్‌లపై ఆధారపడిన పాఠ్య ప్రణాళిక కఠినమైన పద్ధతులలో నడుపబడుతున్న వాటికి బదులుగా విశ్లేషణాత్మకమైన యోచనకు విలువనిచ్చే విద్యా విధానాన్ని, సృజనాత్మకతను, స్వేచ్ఛను గౌరవించే పద్ధతులకు

స్వాగతం పలుకుతారు. మనస్సును తెరుచుకుని ఆలోచించి సృజనాత్మకంగా వ్యవహరించాలి. ఒక కొత్త తరం పరిశోధకులు, సైంటిస్టులు రావాలి. అంతేగాకుండా సమర్థులైన ఇంజనీర్లు, మేనేజర్లు కొత్త విద్యావిధానం నుండి పుట్టుకురావాలి. కమ్యూనిస్ట్ వ్యతిరేకతను తగ్గించి ఉత్తర దక్షిణ కొరియా దేశాల ఏకీకరణ లక్ష్యంగా విద్యావిధానం సాగాలి.

చదువులలో కొత్త కల్పనలు చేయడం వలన ఎక్కువగా నష్టపోయేది జపాన్ దేశమే. ప్రతి వారికీ ప్రస్తుత విధానం తప్పని తెలుసు. కాని ఎవరికీ పడవ మూల మట్టాన్ని కదిపే ధైర్యం లేదు. అసలు ఏం చెయ్యాలో కూడా వారికి తెలీదు. టోకియో సమీపంలో హన్నో అనే నగరం వుంది. అక్కడ జియునోమోరి గకుక అనే ఆచార్యుడు ఒక కొత్త రకం స్కూలుని తెరిచాడు. ఆ స్కూలు బ్రోషర్‌లో యిలా రాశాడు- ''మా ఉద్దేశం నీకు ఉన్న విషయాలు బోధించాలని కాదు. నిన్ను నీకు వచ్చే మార్కుల్ని బట్టి అంచనా వెయ్యాలని కాదు. నడుస్తున్న ఎన్‌సైక్లోపేడియాలని తయారుచేయడం మా ఉద్దేశం కాదు. అటువంటి చదువులు నీకు ఎక్కడపడితే అక్కడ దొరుకుతాయి. నీనుంచి మేము ఆశించేది ఏమంటే ఆత్మస్థైర్యము, నీ ఊహాశక్తి పెరగాలని. నీ స్పందన చురుకుతనం దయాగుణం యివన్నీ చదువుల ద్వారా నీలో పెరగాలని, నువ్వుగాఢంగా ప్రతిదీ నేర్చుకోవాలని కోరుకుంటున్నాం'. ఈ విద్యార్థులు చిట్టచివరికి చూస్తే టెస్ట్‌ల్లో యించుమించుగా పూర్వపు పద్ధతుల వారితో సమానంగా వున్నారు. రీసెర్చి, రిపోర్టులు, స్వయంగా పరిశీలన, స్వేచ్ఛగా ప్రవర్తించడం విద్యార్థులకు వస్తాయి. సంస్కర్తలు కొన్ని యిబ్బందులన్ను చవిచూడాలి. భయం సిగ్గు చదివించడానికి ప్రేరేపకాలుగా యిన్నాళ్ళూ రాజ్యం చేశాయి. సృజనాత్మకమైన మంచి పద్ధతులకి విద్యార్థులు వెంటనే మారజాలరు. ఒకసారి ఒక టీచర్ బెత్తాన్ని బీరువా మీద దాచి మిమ్మల్ని కొట్టను, తిట్టను, మిమ్మల్ని మనుషులుగా చూస్తాను అని చదువుకోమన్నారు. ఆ పిల్లలకు పరీక్షల్లో తక్కువ మార్కులు వచ్చాయట. ఇది తాయివాన్‌లో జరిగింది. స్కూలు పాలకవర్గం ఆ టీచర్ని దూషించి శిక్షించిందట.

అయినప్పటికీ సంస్కరించవలసిన అవసరం ఎంతయినా వుంది. కొంతమంది పిల్లలు పరీక్షల ఒత్తిడిని తట్టుకోలేక నిద్రమాత్రలు వేసుకుంటారట. మిగతా వారు గోళ్ళుగిల్లు కుంటూ బల్లల దగ్గర కూర్చుంటారట. చాలామంది పిల్లలు స్కూలుకి వెళ్ళమని నిరాకరిస్తా రట. క్లాసుకి వెళ్ళి ఎదుర్కోవలసిన స్థితిగతులను తప్పించుకోడానికై స్కూలుకే పోమని మారాం చేస్తారట. ఇదే ప్రవృత్తి పెరిగి పెద్దయాక హఠాత్తుగా శ్రామికులు ఆఫీసుకు వెళ్ళమని మొరాయిస్తారు. మొత్తం సమాజంలో ఏదో జరుగుతోంది. ఏదో తొలచుకుతింటుంది అని వగస్తున్నారు పెద్దలు. స్కూలుకి వెళ్ళ నిరాకరించే ముఠా ఒక యూనియన్‌లా రూపుదా ల్చింది. స్కూళ్ళలో పోటీ బాగా పెరిగింది. విద్యా విధానం ఒక ప్రమాదంలో యిరుక్కుంది. ఇటు అటు కదలలేదు. పోటీ మనస్తత్వం (కాంపిటీషన్) చాక్రికంగా అందరినీ లోబరుచు కుంది. దానిని బద్దలు కొట్టడానికి ఊహాత్మక శక్తిని ఎగిరి వెళ్ళి ఆశ్రయించాలి. చాలా స్కూళ్లలో ఊహా శక్తికి దురదృష్టవశాత్తూ ఎక్కువ ప్రాధాన్యం యివ్వరు.

ఆధారం:

(ప్రపంచ వ్యాప్తంగా మంచి స్కూళ్ళు, మంచి చదువులు ఏవి? ఎక్కడ వున్నాయి అనే అంశంపై న్యూస్ వీక్ తదితరంగా తెలిసిన సమాచార సేకరణ.

# ప్రజా కళాకారుడు చిత్త ప్రసాద్



రచన

చలసాని ప్రసాద్‌రావు

''భారతదేశంలోని కళాకారుడెవరూ కూడా తన నైతిక, రాజకీయ దృక్పథాల్ని వ్యక్తపరచ కుండా ఉండలేదు. కళను ఈ దేశ ప్రజల వాణిగా మలిచే సంప్రదాయాన్ని సృజించే మార్గం అన్వేషించకుండానూ ఉండలేదు.'' అనే అవగాహన చిత్తప్రసాద్‌ది.

కనుకనే, ఈనాడు మనం స్మరించదగిన సృజనశీలిగా, అత్యల్ప కాలంలోనే అనితర సాధ్యమనదగిన స్థాయికి తన కళను అభివృద్ధి పరచుకున్న ప్రజా కళాకారునిగా ఎదగగలిగాడు.

అరవై మూడేళ్ళ జీవిత కాలంలో కనీసం నలభయ్యేళ్ళపాటు అతని కళా సృజన నిర్విరామంగా కొనసాగింది. లెక్కకు అందని అసంఖ్యాకమైన కళాఖండాల్ని అతను దేశ ప్రజలకు కానుకగా అందించాడు. అవన్నీ అతని ప్రత్యేకతను చాటిచెప్పేవే; జీవితం నుండి గ్రహించినవే.

అయితే చిత్తప్రసాద్ కేవలం జీవితాన్నే చిత్రించి ఊరుకోలేదు. ఆ జీవితం అలా ఎందుకు ఉందో కూడా స్ఫురింపజేశాడు. అలా ఉండకూడదని కోరుకునే వారి పక్షాన్న నిలబడ్డాడు. వారి పోరాటాల్ని బలపరిచాడు, తన చిత్రాల ద్వారా. కేవలం బలపరచటమే కాదు, తన చిత్రాల్ని చూసినవారు ఆ పోరాటాల్ని సమర్థించకుండా ఉండలేని విధంగా ఉత్తేజకరంగా వాటిని రూపొందించాడు.

ముప్పయ్ లక్షల మంది అమాయక ప్రజల్ని కబళించిన చరిత్ర ప్రసిద్ధమైన బెంగాల్ కరువు ప్రాంతాల్లో 1943-44లో స్వయంగా పర్యటించాడు. గుండెల్ని పిండే ఆకలి చావుల్ని చిత్రబద్ధం చేసేడు. పొట్టలు పెంచుకున్న బ్లాక్ మార్కెటీర్లను, వారికి అండగా నిలిచిన బ్రిటిష్ పాలక వర్గాన్ని తన శక్తివంతమైన కళలో బహిర్గతం చేసేడు. పాలక వర్గాలు హడలిపోయేట్లు వాటిని రూపొందించేడు. వాటిని ప్రచురించిన పత్రికలే భయపడి ఆ తరువాత వాటిని ధ్వంసం చేసేసినంత శక్తివంతమైనవి ఆ సజీవదృశ్యాలు.

''ఈ దేశంలో చిత్రకారునిగా జన్మించటం కంటె, నిలదొక్కుకోవటమే కష్టం'' అనే మాటను అబద్ధం చేసేడు చిత్త ప్రసాద్. అందుకు కారణం అతను ప్రజల పక్షాన నిలబడటమే. తన కళను జీవనోపాధిగా మలచుకోడానికి అతను సదా నిరాకరించేడు. మార్క్సిజాన్ని మనసా, వాచా, కర్మణా నమ్మి అనుసరించేడు. ''రాజకీయాల్లో పాల్గొన''నని రాసి ఇస్తే తప్ప సీటు ఇవ్వనన్న కలకత్తా గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్ ప్రిన్సిపాల్‌నే కాదన్నాడు. ప్రజల మధ్యనే తన కళకు మెరుగులు దిద్దుకున్నాడు. ''నీకు మేము నేర్పేదేమీ లేదు. నీ పద్ధతిలోనే అలా వేస్తూ వెళ్లు. ఒకనాటికి మమ్మల్ని మించిపోతావు''

అని శాంతినికేతన నిర్వాహకులు రవీంద్రనాథ్ టాగూర్, నందలాల్‌బోస్‌లు ప్రశంసించే స్థాయికి ఎదిగిపోయేడు.

21 జూన్ 1915న బెంగాల్‌లోని 24 వరగణాల జిల్లా, మిడ్నపూర్‌లో జన్మించేడు చిత్తప్రసాద్ భట్టాచార్య. తల్లిదండ్రులు సాహిత్య, సంగీతాల్లో ప్రవేశం ఉన్న వారే గనుక ఇతని కళాభిరుచికి ప్రోత్సాహమే లభించింది. తండ్రి ఉద్యోగ రీత్యా బెంగాల్ అంతటా తిరుగుతూంటే తనూ తిరిగేడు. గ్రామసీమల అందాల్ని ఆకళించుకోవటమే కాదు, ప్రజల జీవన సమరాల్ని గుర్తించేడు. వారి కోసం తపించనారంభించేడు.

విప్లవ కార్యకలాపాలకు కేంద్రమైన చిట్టగాంగ్, బంకురాలలో విద్యాభ్యాసం కొనసాగించేడు. తొమ్మిదిసార్లు వరుసగా జపాన్ బాంబు దాడులకు గురయిన చరిత్రాత్మక స్థలం చిట్టగాంగ్. బ్రిటిష్ సైన్యానికి, అతివాద భారత జాతీయవాదులకూ 1930-34 మధ్య చిట్టగాంగ్ ఒక యుద్ధభూమి. సాయుధ పోరాటాలకు గెరిల్లా దాడులకు అదొక కేంద్రం. అక్కడ ఇంటర్ చదివి ప్యాసయ్యాడు చిత్తప్రసాద్.

అభ్యుదయ రచయితల సంఘం, భారత ప్రజా నాట్యమండలి తొలిరోజుల నుండి వాటితో అనుబంధం పెంచుకున్నాడు. కమ్యూనిస్టుల ''పీపుల్స్ వార్'' పత్రికలో పనిచేశాడు. చిత్రకారుడే గాదు, స్వయంగా కవి, గాయకుడు, రచయిత. 1945లో కలకత్తాలో జరిగిన ''ఫాసిస్టు వ్యతిరేక రచయితలు - కళాకారుల'' వార్షిక సభలో చిత్తప్రసాద్ పాటలు రెండింటిని ప్రజానాట్యమండలి వారు గానం చేయగా శ్రోతలు ఉర్రూతలూగేరు. అతని కవితలు ఆనాడే రెండు సంపుటాలుగా వెలువడ్డాయి. బెంగాలీ జానపద గాథలను స్వంత బాణీలో తిరగరాసి తన బొమ్మలతో సహా ఒక సంపుటంగా ప్రచురించేడు.

చిత్రకారునిగా చిత్తప్రసాద్ మనదేశంలోని అభ్యుదయ, అతివాద, కమ్యూనిస్టు ఉద్యమాలకు చేసిన సేవ మరువలేనిది, మరువరానిది, సాటిలేనిది. ''కళను ఈ దేశ ప్రజల వాణిగా మలిచే సాంప్రదాయాన్ని సృజించే మార్గం అన్వేషణ''లో అతను మరెవరికన్నానూ ఘనంగా విజయుడయ్యేడు. తన ముందున్న వివిధ భారతీయ, విదేశీయ, సాంప్రదాయ, ఆధునిక కళా రీతుల్ని ఆపోసనం పట్టేడు. జర్మన్ కాత్‌కొల్విట్జ్, మెక్సికన్ చిత్రకారులు, చైనీస్ - జపానీస్ ఉడ్ కట్ రీతులు, గోయా రాజకీయ వ్యంగ్య చిత్రాలు, మనదేశపు మొఘల్, రాజ్‌పుట్ సూక్ష్మచిత్ర రీతులు, బౌద్ధ గుహా కుడ్య చిత్ర, శిల్పాలు, డేవిడ్ లో ఆధునికత- అన్నీ అతనికి అధ్యయనం చేయదగినవే అయ్యాయి. వీటన్నింటిని తను ప్రత్యక్షంగా చూసి ప్రేరణ పొందిన బెంగాల్ జానపద కళారీతులతో సమన్వయించుకున్నాడు. తనదైన విశిష్ట మార్గాన్ని మలుచుకున్నాడు.

''గ్రాఫిక్స్'' జాబితాలోని లినోకట్, ఉడ్ కట్ ప్రక్రియలపై అధికారం సాధించాక దాన్ని ప్రజలను చైతన్యవంతులను చేసే కృషిలో పెద్దఎత్తున, క్రమబద్ధంగా శక్తివంతంగా వినియోగించిన తొలి చిత్రకారుడు చిత్తప్రసాద్. దీర్ఘకాలం ఈ విధానాన్నే అతను కొనసాగించాడు.

1946లో బొంబాయికి తరలివచ్చి 1978 నవంబర్ 13న కలకత్తాకు అనారోగ్యంతో తరలించబడి మరణించే దాకా అక్కడే స్థిరపడిపోయేడు చిత్తప్రసాద్.

1949లో ప్రపంచ శాంతి సంఘం పిలుపుపై అనేక చిత్రాలను రూపొందించి శాంతి ఉద్యమానికి అంకితం చేసేడు.

1950లో ''కేలాఘర్'' పేర స్వయంగా ఒక పప్పెట్ థియేటర్ను నెలకొల్పేడు. ఆ ప్రాచీన కళారీతిని ఆధునిక అవసరాల కనుగుణంగా తీర్చిదిద్ది ఆ రంగంలో పునరుజ్జీవనోద్యమానికి ఆద్యుడయ్యేడు.

1946-48 మధ్య కాలంలో తెలుగువారిని తెలుగు ప్రజల సాయుధ పోరాటాల్ని కళ్ళకు కడుతూ ఎన్నో చిత్రాలు వేసేడు. నిజాం వ్యతిరేక తెలంగాణా సాయుధ పోరాటాన్ని మరే చిత్రకారుని కన్నా శక్తివంతంగా ప్రజల కళ్ళకు కట్టేట్లు చేసేడు. అతని రేఖలలో తెలుగు రైతులు, మహిళలు అజరామరులయేరు.

మొదటి నుండి తనవైన ''నైతిక - రాజకీయ'' దృక్పథాలకు కట్టుబడి బ్రతికిన కళాకారుడు చిత్తప్రసాద్. తన కళను అమ్మి బ్రతకటానికతను నిక్కచ్చిగా నిరాకరిస్తూ వచ్చేడు. మనసొప్పని వాటిని వేయలేకపోయేడు. అందుకు దరిద్రాన్ని భరించవలసి వచ్చినా వెనుకంజ వేయలేదు.

1978లో కాలికి దెబ్బ తగిలి అనారోగ్యం పాలై కలకత్తాకు తరలించబడ్డాడు. నవంబర్ 13న అమరుడైపోయాడు.

చిత్తప్రసాద్ ''గ్రాఫిక్స్'' వేల సంఖ్యలో చెల్లాచెదరై ఉన్నా యీనాడు మనదేశంలో వ్యక్తుల వద్ద తప్ప ఏ గ్యాలరీలోనూ భద్రపరచబడి లేవవి. చెకొస్లొవేకియాలో, రష్యాలో, అమెరికాలో అతని చిత్రాలున్నాయి. ప్రపంచ శాంతి సంఘ బహుమతినందుకున్న అతని జీవితాన్ని చూసే ఒక చిన్న డాక్యుమెంటరీ ఫిల్మ్ చెకొస్లొవేకియాలో ఉంది.

ఇవన్నీ మనకు అందుబాటులో లేనివే కానీ, ప్రజాకళాకారుడు చిత్తప్రసాద్ సమగ్ర స్వరూపాన్ని దర్శించే రోజు మరెంతో దూరంలో లేదు. ప్రజల కోసం నిలబడి, వారి కోసం తన కళతో పోరాడిన ధీరుడు చిత్త ప్రసాద్.



బెంగాల్ జానపద జీవన దృశ్యం — చిత్త ప్రసాద్

# తెలుగు సాహిత్యంలో అధిక్షేప కావ్యాలు

- డా. బూదరాజు రాధాకృష్ణ

తెలుగు సాహిత్యంలో ఇతర భారతీయ సాహిత్యాల్లో లాగానే హాస్యరస స్ఫోరకమైన అధిక్షేపణ చాలా తక్కువ. కొన్ని ఇతర సమాజాల్లో లాగా హాస్యమయమైన విమర్శకు గాని, చివరికి ఉత్సవాలకు గాని మన సమాజంలో స్థానం లేదు. మనం హాస్యాధి దైవతమని భావించే వినాయకుడి పండుగలో కూడా సరదాల మీద దృష్టి తగ్గిపోతున్నది మనకు. ప్రాచీన రోమన్ సమాజంలో "Festival of Saturnalia" అనే పండుగ జోరుగా జరిగేది. ఆ సమయంలో రాజుల నుంచి సామాన్యుల దాకా అందరూ నవ్వుతూ, వెక్కిరిస్తూ, వేళాకోళం చేస్తూ విమర్శిస్తూ కాలం దొర్లించే వాళ్లు. మధ్యయుగాల్లో అనేక యూరోపియన్ దేశాల్లో 'Feast of Fools' అనే వినోదాత్మకమైన పండుగ జరిగేది. బహిరంగ విమర్శలకూ అధిక్షేపాలకూ అవకాశమిచ్చే "Fasching" అనే సారస్వత లక్షణం గల పండగ ఆస్ట్రియాలో జరిగేది. నేటికీ ఆఫ్రికా ఖండంలోని 'అషాంతి' దేశంలో ప్రతి శుక్రవారం నాడూ ప్రజలు గుమిగూడి రాజును అతని సమక్షంలోనే నానా విధాలుగా ఆక్షేపిస్తుంటారు. ఆ రోజు ఏమన్నా చెల్లుతుంది. మరునాటి నుంచీ అలా చేయటం నిషిద్ధం-ప్రమాదకరం. ఇలాంటి సంప్రదాయాలు మనకు లేవు. ఉంటే-అవి మన సాహిత్యంలో ప్రతిబింబించేవి.

ఆధునిక సాహిత్యంలో-వీరేశలింగయుగం నుంచీ పెద్ద సంఖ్యలో కాకపోయినా రకరకాల అధిక్షేప కావ్యాలు వెలువడ్డాయి. వాటినే ఇప్పుడు చర్చిద్దాం. ఈ రకం సాహిత్యం పద్యం, గేయం, వచనం లాంటి అనేక రూపాల్లో వచ్చింది. స్వభావరీత్యా వింగడిస్తే తెలుగులోని అధిక్షేప కావ్యాలను ప్రధానంగా మూడు రకాలని చెప్పవచ్చు- సాహిత్యక, సామాజిక, రాజకీయ కావ్యాలని వీరేశలింగం గారే ఆధునిక యుగంలో ఆక్షేప కావ్యాలకు శ్రీకారం చుట్టారని చెప్పవచ్చు. ఆయన నాటికి వెర్రితలలు వేసిన ప్రబంధ ప్రక్రియనూ, అందులోని గతానుగతిక రచనా ధోరణినీ, అధిక్షేపిస్తూ, వీరేశలింగం రాసింది 'అభాగ్యోపాఖ్యానం' అనే కావ్యం. ప్రబంధాల్లో సాధారణంగా ఉదాత్త నాయికా నాయకులూ వారి శృంగార క్రీడలూ వర్ణితాలు. వీరేశలింగం గారి కథానాయికా నాయకులు అనుదాత్తులు. "అతనికి పొట్ట గోసినను అక్షరమొక్కటి లేదు, కాగడతో వెతకిన తెల్విలేదు" మొదలుగా నాయకుణ్ణి వర్ణిస్తాడు. ప్రబంధ కవుల-ముఖ్యంగా క్షీణయుగ ప్రబంధ కవుల-శబ్దాడంబర శుష్క వర్ణనలకు ప్రతిగా "డాయను భీతి బొంద మగడాయను, తల్పులు తీయమేని రండాయను, పల్కవేమి చెవుడాయను" ఇత్యాది దుర్భర ప్రసంగాలు కూడా అందులో ఉన్నాయి. ప్రబంధ ప్రక్రియా సమష్టిని అధిక్షేపించటమే ప్రధానంగా పెట్టుకొని ఆయన "అభాగ్యోపాఖ్యానం" రాశాడు. వచన గ్రంథాలనూ, నాటకాలనూ కూడా కావ్యాలంటే చాలమంది ఒప్పుకోరు. కానీ "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అనే పండితరాయల నిర్వచనం ప్రకారమయితే వీరేశలింగం గారి ప్రహసనాలూ, తిర్యగ్విద్వన్మహాసభ వంటి రూపకాలూ అధిక్షేప కావ్యాలనే చెప్పవచ్చు.

ఈ నిర్వచనం ప్రకారం గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' ఆధునిక సాహిత్యానికి మకుటాయమానమైన అధిక్షేపకావ్యమనాలి. సమాజంలోని వైరుధ్యాలను, లోపాలను, వంచనలను, అంతకన్నా సుకుమారంగా సుందరంగా సర్వాంగీణంగా అధిక్షేపించిన మరో గ్రంథం మనకు లేదంటే అతిశయోక్తి కాదు. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి 'గణపతి', మొక్కపాటి నరసింహశాస్త్రిగారి ''బారిష్టర్ పార్వతీశం'' వంటివి కావ్యాలంటే ఒప్పుకోమనీ, అధిక్షేప గ్రంథాలంటే సరిపెట్టుకుంటామనీ అనే వాళ్ళూ ఉన్నారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు గారి ''సాక్షి'' వ్యాసాలు, 'కంఠాభరణం' వంటి నాటకాలు మన సమాజ సాహిత్యాలను రెంటినీ అధిక్షేపించే రచనలు.

పద్య రచనల్నే కావ్యాలుగా పరిగణించినట్లయితే త్రిపురనేని రామస్వామి చౌదరిగారి ''సూతపురాణం'' అధిక్షేప పురాణం. తిరుపతి వేంకట కవుల 'గీరతం' వ్యక్తి దూషణ పూర్వకమైనా అధిక్షేప కావ్యమే. ఆ తరంలో కొప్పరపు వారూ, రామకృష్ణ కవులూ, తిరుపతి వేంకటకవులూ ఒకర్నొకరు అధిక్షేపిస్తూ బండ్ల కొద్ది పద్యాలూ పుస్తకాలూ రాసుకున్నారు. అయితే వాటి ప్రయోజనం పరిమితం. 'రావణ దమ్మీయం-ఉరఫ్-లంకా విజయం' పద్ధతిలో నిర్ధూమధామంగా దూషించిన కావ్యాలవి. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి చాటు పద్యాలు అధిక్షేపకాలు. బహుశా రాజకీయాలకు కూడా అన్వయించి అధిక్షేప ప్రక్రియను విస్తరించిన మొదటి తెలుగుకవి ఆయనే ఏమో. సుప్రసిద్ధ రాజకీయ నాయకులందర్నీ వెక్కిరించి వేళాకోళమాడిన ఆంధ్ర రత్న ''గోపాల కిష్టాయి కొక్కిరాయి'' అని ఆత్మనింద చేసుకొని, తన అధిక్షేపణల తీవ్రతను ఒక్కసారిగా తగ్గించి వేశారు. ఎంకి పాటలు మీద ఆయన రాసిన అధిక్షేపణ గేయం, గేయ ప్రక్రియలో తొలి అధిక్షేపణమేమో.

శతక వాఙ్మయంలో అనూచానంగా అధిక్షేపం కనిపిస్తుంది. వేమన పద్యాల్లో రకరకాల అధిక్షేపాలున్నాయి. ఆధునికులు చాలామంది ఇంకా శతకాలు రాస్తున్నారు. వాటిలో సామాజిక, రాజకీయ వ్యవస్థల మీద అంతో ఇంతో అధిక్షేపం కనిపించక పోలేదు. భావకవిత్వం బాగా పేరు సంపాదించి స్థిరపడిన తర్వాత ఉత్తమ భావ కవితకు, నిదర్శనగా ఉన్న దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'కృష్ణ పక్షాన్ని' అధిక్షేపిస్తూ అనంతపంతుల రామలింగస్వామి గారి 'శుక్లపక్షం' వెలువడి కొంత సంచలనం తెచ్చింది. కానీ నిలవలేక పోయింది.

అధిక్షేపమనగానే ఈ శతాబ్దంలో గుర్తుకు వచ్చే రెండు పేర్లలో మొదటిది జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి గారిది. చమత్కారం, వెక్కిరింత సమపాళ్ళలో నడిపిన ఆ మహాత్ముడు తన పేరును కూడా రకరకాలుగా రాసుకున్నాడు. జరుక్, జరుక్‌శాస్త్రి రుక్కుటేశ్వర్, మిణీశాస్త్రి వగైరాలుగా ఆయన విశ్వనాథ సత్యనారాయణ గారిని అధిక్షేపిస్తూ ''పాషాణపాక ప్రభూ'' అని ముగించిన పద్యం చాల ప్రాచుర్యం పొందింది. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు బతికి ఉండగానే అవధాన ప్రదర్శనలు దేశంలో మార్మోగి పోతుండగానే, జరుక్ శాస్త్రి తిరుపతి వేంకటకవుల్నీ, అవధాన విద్యనూ అధిక్షేపిస్తూ చెప్పిన గేయం తమాషా అయింది.

''లలాటాన కుంకుమాగ్ని
బుజం మీద మబ్బు దుబ్బు
కాళ్ళకింద కిర్రుచెప్పు
అంగోస్త్రం, పొడుంకాయ

వ్యవధి లేని అవధానం
వెళ్ళి పోయిందెళ్ళిపోయింది.''

అని జరుక్‌శాస్త్రి వర్ణించాడు. వ్యక్తికీ విషయానికీ ముడిపెట్టి మరీ రాశాడు.

భిన్నరూపాల సాహిత్యంలో భావకవిత్వాన్ని, అవధాన కవిత్వాన్ని మరిచిపోకుండా రాజకీయ, సామాజిక విషయాలను కూడా చేర్చుకుంటూ అధిక్షేప సాహిత్యం సృష్టించిన వాడు మాచిరాజు దేవీప్రసాద్. దేవులపల్లి కృష్ణశాస్త్రి భావ, ప్రణయ కవితలకు పోటీగా 'తాత విరహం' వంటి కావ్యాలు రాశాడు. విశ్వనాథ సత్యనారాయణ గారి సంప్రదాయ వాదాన్ని అధిక్షేపిస్తూ ''అచ్చొత్తించు శ్రీ ప్రెస్సులో శ్రీ అచ్చుల్ సరిపోయి ఏడ్చిన విటోయ్ శ్రీ విశ్వనాథేశ్వరా?'' అని ప్రశ్నించాడు. శ్రీశ్రీ ''మహాప్రస్థాన'' గేయాలను అధిక్షేపిస్తూ ''రహదార్ల చరిత్ర సమస్తం, పరపీడా పరాయణత్వ'' మన్నాడు. ప్రపంచయుద్ధ కాలం నాటి కాగితం కరువును, అప్పటి పొదుపు ఉద్యమాన్నీ అధిక్షేపిస్తూ, ఉత్తర ప్రత్యుత్తర రూపంలో రెండు వచన గ్రంథాలనూ, ఓ పద్య రచననూ చేసి ఇబ్బంది పాలైనాడు.

''కాగితం ఖర్చు చేయబోకండి. మీరు కాగితం ఖర్చు చేయనీకండి అనుచు విశ్వరూపాల వంద వేయి కోట్లు వాలుపోస్టరులంటించె వాడ వాడ''

అని అప్పటి ప్రత్యేకాధికారి చేష్టలు వెక్కిరించి

''ఉన్న భార్య, దూరాన ఇరుక్కుపోయె! ప్రణయ లేఖమ్ము వ్రాయ పత్రమ్ము లేదు! ప్రణయ కావ్యమ్ము వ్రాయ పత్రాలు లేవు''

అని బాధపడ్డాడు. అంత కరువులోనూ కవులు రచనా కండూతిని వదులుకోలేక పోయారని అతడి అధిక్షేపం.

శ్రీశ్రీ 'సిరిసిరి మువ్వ శతకం', 'రుక్కుటేశ్వర శతకం' వంటివి అధిక్షేప కావ్యాలే. ప్రాచీన నీతి పద్యాల ధోరణిని అధిక్షేపిస్తూ

''పిల్లులు పిల్లల బెట్టును
నల్లును ద్రావెడి కతాన నల్లి అనబడెన్
అల్లుడు దశమోగ్రహమగు
వెల్లుల్లికి తీపిలేదు విశ్వమున జరూ!''

అంటూ శ్రీశ్రీ అధిక్షేపించాడు. ఈ ధోరణిలోనే ఆరుద్ర అధిక్షేపిస్తూ గేయాలు రాశాడు. ఆయన మత, సామాజిక స్థితిగతులను కూడా అధిక్షేపిస్తూ

''ఏకపత్నీ వ్రతము
ఎలుగెత్తి మన మతము
వేల్పు భార్యలు శతము
ఓ కూనల మ్మా శ్రీ!..... కాల వశమున
చాల ముద్దులు కోరి
దేవుడే వ్యాపారి

ఓ కూనలమ్మా!'' ఇత్యాదిగా కూనలమ్మ పదాలను అధిక్షేపకంగా రాశాడు.

రాజకీయ సిద్ధాంతాలు ప్రధానంగా సామాజిక రుగ్మతలను అధిక్షేపిస్తూ రాసిన వాళ్ళు సుప్రసిద్ధులు గజ్జెల మల్లారెడ్డి, రాంభట్ల కృష్ణమూర్తులు. మల్లారెడ్డిగారి 'శంఖారావం'లో ''అడగని వరమిచ్చు వేల్పులంటూ ఉన్నారురా?'' అని గురువడిగితే శిష్యుడు చెప్పిన సమాధానం అధిక్షేపంగా ఉంటుంది. ప్రాచీన గురుశిష్య సంవాద సంప్రదాయ ధోరణిలో ఇది రాజకీయాధిక్షేపం చేయటం. అలాగే ''ఇద్దరు పండితుల మధ్య ఒద్దిక లెట్లుండురా?'' అనే గురువుగారి ప్రశ్నకు శిష్యుడి సమాధానం ''అగ్గిమీద గుగ్గిలమ్మ! నిగ్గుదేరినట్లు గురూ!'' అనేది రాంభట్ల కృష్ణమూర్తిగారి ''శశవిషాణం'' వంటి కావ్యాల్లోని సమస్త విషయాలూ రాజకీయ అధిక్షేపాలే. దసరా పద్యాలుగా రాసిన పేరడీల్లో కూడా అది ప్రతిఫలిస్తుంది.

''అయ్యవార్లకు చాలు అర్ధ జీతాలు పిల్లవాళ్ళకు చాలు పూట పాఠాలు'' మొదలుగా నడుస్తుంది అధిక్షేపం. దిగంబర కవులవంటి తీవ్రవాదులు సాగించిన రాజకీయ సాహిత్యక అధిక్షేపం చాలా సందర్భాల్లో సభాసాధువు కాదు కానీ అధిక్షేపమే.

తెలుగువాళ్లకు కోపతాపాలుగాని, ప్రేమాభిమానాలుగాని కొంచెం ముదురుపాకంలోనే ఉండటంవల్ల బహిరంగ ప్రదేశాల్లో ఇప్పటి సామాజిక ధర్మం ప్రకారం ఉదాహరించడానికి వీలులేని అధిక్షేపకావ్యాలు చాలా ఉన్నాయి. ఒక విధంగా అవి తిట్టు కవితగా మారాయనిపిస్తుంది. సాక్షి వ్యాసాల్లోని అనేకాధిక్షేపాలను ఈ కాలంలో ప్రస్తావించటం కష్టం. దాసు శ్రీరాములుగారి ''తెలుగునాడు'' వంటి అధిక్షేప కావ్యాల్లో సమకాలంలో కులాల, శాఖల, ఉపశాఖలమీద నేటి సమాజ న్యాయం ప్రకారం, రాయడానికి గాని, బహిరంగ స్థలాల్లో చదవడానికి గాని వీలులేని కులమత దూషణలున్నాయి. ప్రాచీన సాహిత్యంలోనే కాక సమకాలిక సాహిత్యాలలో కూడా ఇలాంటి అసహన ప్రసంగాలుండటం మన దురదృష్టం.

మానవజాతి ఉన్నంత కాలం దానిలో మంచితోబాటు చెడుకూడా ఉంటుంది. చెడును తీవ్రంగా ప్రతిఘటించటం ఒక ఎత్తయితే, వెక్కిరించి ఎత్తి చూపడం మరో పద్ధతి. మన ఆచార వ్యవహారాల్లో, మన సంప్రదాయాల్లో, రాజకీయ వ్యవస్థలో, సాహిత్యంలో ఉన్న లోపాలను అధిక్షేపించే సాహిత్యం తెలుగులోనే కాక మొత్తం భారతీయ సాహిత్యంలోనే చాలా తక్కువనిపిస్తుంది. భగవద్గీత వంటి పవిత్ర గ్రంథాన్ని అక్షరాక్షరం అధిక్షేపిస్తూ ''ఉత్తర గీతలు'' రాసుకున్న జాతిలో, పాణినీయం వంటి సూక్ష్మశాస్త్ర ప్రసంగాలకు అధిక్షేపాలు పరంపరగా చెప్పుకున్న జాతిలో, విమర్శను భరించలేని, సహించలేని సౌకుమార్యం ప్రబలిపోవటమే ఆశ్చర్యకరం. అంతేకాదు హాస్యం అశ్లీలమయితే గాని రాణించదని, అధిక్షేపణ ఒక మతాన్నో, కులాన్నో, రాజకీయ పక్షాన్నో దూషించేవిగానే ఉండాలని చాలమంది నమ్ముతున్నట్లుంది. సంస్కృతంలో లాగా అన్యాపదేశ కావ్యాలు ప్రత్యేక ప్రక్రియగా నేటి తెలుగులో కూడా రాకపోవడం విచారకరం.

ఆధునిక తెలుగు సాహిత్యంలో కరుణప్రధానంగా అధిక్షేపించిన మహాకవి జాషువా. ప్రత్యేకించి అధిక్షేపక ఖండకావ్యాలు రాయకపోయినా, రాసినా వాటిలో అధిక్షేపాన్ని కరుణామయంగా చొప్పించిన వాడు జాషువాయే ననిపిస్తుంది. ఆ అధిక్షేపంలో మెత్తని మందలింపేగాని ద్వేషంలేదు. తాను గాంధేయుడై తన పక్షం వాళ్ళే అధికారంలో ఉన్నా ఆయన సుకుమారంగా అధిక్షేపించాడు. గాంధీజీ మరణానంతరం మన సమాజంలో నిలిచిపోయిన యాథార్థ్యాన్ని అధిక్షేపిస్తూ జాషువా

''కలకల నవ్వేదు తాతయ
శిలయై, కలయై అనంత శిల్పంబునకున్
బలమిచ్చి మాయమయ్యేన్
కుల మత తత్వములు పుంజుకొని తలయెత్తెన్''

అని వాపోవటంతో మన సమాజంలో మాటకూ, చేతకూ పొంతన లేకపోవటాన్ని ఆయన అధిక్షేపించాడు.

మానవ సమాజంలోని అత్యధిక సంఖ్యాకులు దారిద్ర్యరేఖకు దిగువన ఉంటున్నారు. వారికి కావలసింది తిండీ, గుడ్డా, తలదాచుకునేందుకు కాస్త జాగా. శ్రీకృష్ణదేవరాయల కాలంలో రత్నాలను వీథుల్లో రాసులుగా పోసి అమ్ముకునే వాళ్లమని శాసనాలూ, కైఫియత్తులూ, ప్రబంధ వర్ణనలూ ఉటంకిస్తూ మన ప్రాచీన వైభవాన్ని కళ్ళకు కట్టేటట్లు వర్ణించినా సామాన్య ప్రజలకు కడుపు నిండదంటాడు జాషువా. అందుకే

''రేయిబవలు భారతీయ సంస్కృతి పేర
గండ శిలలు చూపి కథలు చెప్పి
పేదవాని కడుపులోగల చిచ్చును,
గడపగలవె నీవు గగనవాణి''

అని ప్రశ్నిస్తాడు. ఇటువంటి అధిక్షేపాలు వెతికితే అనేకేతర కావ్యాల్లో కనిపిస్తాయి. కానీ అవి మన సాహిత్యంలో అధిక్షేప కావ్యాలకున్న కొరతను తొలగించలేవు.

ప్రాచీన సంప్రదాయం ప్రకారం హాస్యం మాననీయం కాదు. శుద్ధహాస్యం అంతకన్నాను. అధిక్షేపం హాస్య ప్రధాన మనుకోనక్కర లేదు. దూషణ ప్రధానమనీ భావించనక్కరలేదు. వాస్తవ పరిస్థితి చిత్రణ ద్వారా కూడా అధిక్షేపాన్ని సాధించవచ్చు. కడుపులోని బాధను కన్నీళ్ళతో కడుక్కోడానికి అధిక్షేప సాహిత్యం అక్షరాలా ఉపయోగపడుతుంది. ఈ శతాబ్దారంభంలో ప్రాచీన ధోరణిలోనే పుల్లకవి అనే చాటుకవి చేసిన అధిక్షేపం వినండి.

''కోణంగి నాట్యముల్ కోతులాడించగా
ఊరబందులు తలలూపినట్లు
గూబ కూతలు విని గువ్వలు తలలూచి
పోయి కాకుల వద్ద పొగడినట్లు
కాలువదరి నుండీ కప్ప లంకించగా
ఎండ్రకాయలు తలలెత్తినట్లు
ఎనుబోతు బిరుదులు మనుబోతు పొగడంగ
మేలు మేలని గొర్రె మెచ్చినట్లు
ఓగు ధగిడీలు తమలోన నౌకరి నౌకరు
మెచ్చుకొనుచుందు రెటువంటి పిచ్చితనమొ!''

అని విస్తుపోతాడు. ఈ విధంగా చెట్టు మీదా పిట్ట మీదా పెట్టి అధిక్షేపించే సంప్రదాయం ఉండేది. కందుకూరి వీరేశలింగం గారి ''తిర్యగ్విద్వన్మహాసభ''లో అడవిలోని పశుపక్షులు మన సమాజంలోని అవకతవకలను ఇలాగే చర్చిస్తాయి. ఈ రకమైన అధిక్షేప కావ్యాలు మనకు చాలా తక్కువ. ఇకముందు వస్తాయని ఆశి ్రం.

# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of MISIMI

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC X Roads, Musheerabad<br>Hyderabad-500 020 A.P. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | | |
| Address | | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC X Roads, Musheerabad<br>Hyderabad-500 020<br>1-1-593/A/1,<br>Gandhinagar,<br>Hyderabad-500 380 |
| 4. Publisher's Name | | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | | Yes |
| If foreigner, state the country of origin | | |
| Address | | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC X Roads, Musheerabad<br>Hyderabad-500 020<br>1-1-593/A/1,<br>Gandhinagar,<br>Hyderabad-500 380 |
| 5. Editor's Name | | ALAPATI RAVINDRANATH |
| Whether citizen of India | | Yes |
| If foreigner, state the country of origin | | |
| Address | | 1-1-60/5, Iftekar Mansion Lane<br>RTC X Roads, Musheerabad<br>Hyderabad-500 020<br>1-1-593/A/1,<br>Gandhinagar,<br>Hyderabad-500 380 |
| 6. Name and address of individuals who own the news-paper and partners or shareholders holding more than one percent of the total capital. | | Kala Jyothi Process Pvt. Ltd.,<br>1-1-60/5, Iftekar Mansion Lane,<br>RTC X Roads, Musheerabad,<br>Hyderabad-500 020 |

**I, ALAPATI RAVINDRANATH,** hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for **KALA JYOTHI PROCESS Pvt. Ltd.,**
**Sd/- ALAPATI RAVINDRANATH**
Publisher

Date: March 7, 1992.